# ముఖ చిత్రం

సంకేతస్థలికి రాని ప్రియుని కోసం కుర్చుండీకూర్చోలేక, నిలుచుండీ నిలుచోలేక ఆతురతతో ఎదురుచూసే ప్రియురాలు ఉత్కంఠిత

నదీసైకతస్థలిలో ఒక వృక్షం. ఆవృక్షకాండానికి, పాపం ప్రియుడు అనుకొందో ఏమో, మల్లెపూదండవేసింది ఆమె. ఆ చెట్టుక్రింద పండుటాకుల సెజ్జ. దాని మీద మల్లెలు పరుచుకొన్నాయి. పక్షుల ప్రేమజంట కొమ్మపై వాలి ఉంది. కారు మేఘాల అంచులు మెరుపులతో మిలమిల మంటున్నాయి. మరి వర్షం వస్తుందో ఏమో! ప్రియుడు రావడమే తరువాయి. ఏడీ! అతడు ఎంతకూ రాడాయె. ఏమిసేతునా అని ఎదురు చూస్తోంది.

# మిసిమి

**"All that we are is the product of what we have thought" is "We are what we think." — Dammapada.**

సంపుటి 9 ఏప్రిల్ 1997 సంచిక 3

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ **రవీంద్రనాథ్ ఆలపాటి**

## విషయసూచిక





విడిప్రతి రూ. 6/- వార్షిక చందా రూ. 70/-

ముఖచిత్రం : **ప్రియురాలి ఎదురు తెన్నులు - కంగ్రా**
(Collection of Raja Dhruv Chand of Lambagraon)

**Printed, Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd.,
1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7612436, 7612337.**

సంపాదకుడు : **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

# Form IV (SEE RULE 8)

## Statement about ownership and other Particulars of MISIMI

| | | |
|---|---|---|
| 1. | Place of Publication | 1-1-60/5, Iftekar Mansion Lane<br>RTC 'X' Roads, Musheerabad<br>Hyderabad - 500 020 A.P. |
| 2. | Periodicity of its Publication | Monthly |
| 3. | Printer's Name<br>Whether citizen of India<br>If foreigners, state the country of origin<br>Address | ALAPATI BAPANNA<br>Yes<br><br>1-1-60/5, Iftekar Mansion Lane<br>RTC 'X' Roads, Musheerabad<br>Hyderabad - 500 020 A.P. |
| 4. | Publisher's Name<br>Whether citizen of India<br>If foreigners, state the country of origin<br>Address | ALAPATI BAPANNA<br><br><br>1-1-60/5, Iftekar Mansion Lane<br>RTC 'X' Roads, Musheerabad<br>Hyderabad - 500 020 A.P. |
| 5. | Editor's Name<br><br>Whether citizen of India : Yes<br>If foreigners, state the country of origin<br>Address | ANNAPA REDDY<br>VENKATESWARA REDDY<br><br>1-1-60/5, Iftekar Mansion Lane<br>RTC 'X' Roads, Musheerabad<br>Hyderabad - 500 020 A.P. |
| 6. | Names and addresses of individuals who own the newspaper and partners or shareholders holding more than one percent of the total capital. | ALAPATI BAPANNA<br>337-A, Road No.10,<br>Jubilee Hills,<br>Hyderabad - 500 034 |

I, **ALAPATI BAPANNA**, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Sd/-
**ALAPATI BAPANNA**
Published

Date: March 1,1996.

# వర్తమాన అన్వేషణలో - ఆక్టేవియోపాజ్

ఆక్టేవియోపాజ్ సంక్షిప్త అనువాదం : **బి. తిరుపతిరావు**

నోబెల్ సాహితీ పురస్కార స్వీకార ఉపన్యాసం

(8 డిసెంబరు 1990)

నా ఉపన్యాసాన్ని మానవజాతి ప్రారంభకాలం నుంచి ఉచ్చరిస్తూ వస్తున్న "Thank You" అనే రెండు పదాలతో ప్రారంభిస్తాను. కృతజ్ఞత (Gratitude) అనే మాటకు ప్రతిభాషలోనూ అనేక సమానార్థాలువున్నాయి. ప్రతిభాషలోనూ అర్థ విస్తృతి అనంతంగానే వుంది. కటాక్షం ఫలాపేక్షరహితంగా వుంటుంది; అది ఒకవరం. దీన్ని పొందినవాడు, దానిచే ఆవరింపబడిన వాడు దానికి కృతజ్ఞుడిగా వుంటాడు. అతడు నీచుడుకాకపోతే ఆకృతజ్ఞతని వ్యక్తం చేస్తాడు. తేలికపాటి ఈ మాటలతో నేను ఆపనే చేస్తున్నాను. నేనుచ్చరించే ప్రతిపదమూ ఒకనీటిబిందువైతే దాంట్లో మీరు కృతజ్ఞత ఆమోదాలను చూస్తారు. అలాగే ఈ పదాలలో అనిర్వచనీయమైన భయం, గౌరవంల సమ్మేళనం చూస్తారు. మరీ ముఖ్యంగా నన్ను ఇక్కడ మీముందు, స్వీడిష్‌జ్ఞానానికి, ప్రపంచసాహిత్యానికి కేంద్రమైన ఈ స్థలంలో, నిలబడిమాట్లాడటంలో ఆశ్చర్యాన్నికూడా గమనించవచ్చు.

దేశాలు అని మనం పిలిచే రాజకీయ, చారిత్రక అంశాన్ని అధిగమించే విస్తృత వాస్తవికతలో, భాషలు, లాటిన్ అమెరికాలో మేం మాట్లాడే యూరోపియన్ భాషలు దీన్నే విశదపరుస్తాయి. ఇంగ్లాడ్, స్పెయిన్, పోర్చుగల్, ఫ్రాన్స్ దేశాల సాహిత్యాలతో పోల్చినపుడు. మాలాటిన్ అమెరికన్ సాహిత్యాల ప్రత్యేకస్థితి 'నిర్దిష్టంగా ఈ మౌలికాంశాలమీదే ఆధారపడివుంది. ఇవి తిరిగిపుట్టిన భాషల్లో రాయబడిన సాహిత్యాలు. భాషలు స్వస్థలాలలో పుట్టిపెరుగుతూవుంటాయి, సాధారణ చరిత్ర చేత పోషించబడతాయి. యూరోపియన్ భాషలో తమ స్వస్థలాలనుంచి, సంప్రదాయాలనుంచి పునాదులతో సహా పెకలించబడి. అపరిచితమైన పేరులేని ప్రాంతాలలో ప్రతిష్టించటం జరిగింది. ఈ కొత్త ప్రాంతాలలో అవివేళ్ళూనుకొని, ఆసమాజాల్లా పెరిగాయి, మార్పుకు గురయ్యాయి. మా సాహిత్యాలు పునఃప్రతిష్టచేయబడ్డభాషను మారుతున్నక్రమాన్ని ఉదాసీనంగా అంగీకరించటం లేదు. ఈక్రమంలో అవికూడా పాల్గొంటున్నాయి. ఈ మారుతున్నక్రమాన్ని వేగవంతంచేస్తున్నాయి. చాలా త్వరగానే మాసాహిత్యాలు కేవలం అట్లాంటిక్ ఆవలి ఆలోచనలోగా వుండటం ఆగిపోయింది. కొన్ని సందర్భాలలో యూరోపియన్‌సాహిత్యానికి విరుద్ధంగాకూడా వచ్చాయి. ఎక్కువ సందర్భాలలో యూరోపియన్ సాహిత్యంతో సమానంగా వచ్చాయి.

ఈ వూగిసలాటలు వుంటున్నప్పటికీ, వీటిమధ్యవున్న లింకు ఎప్పుడూ తెగలేదు. నాకు ప్రామాణిక గ్రంథాలు నా భాషలోవే. ఏ స్పానిష్ రచయితలాగానే నేనూ ఆస్పానిష్‌నుంచి వచ్చిన వాడిలాగానే భావించుకుంటాను. అయినప్పటికీ నేను స్పానియర్డ్‌నికాదు. స్పానిష్ అమెరికాలో చాలామంది రచయితలు, అమెరికా, బ్రెజిల్, కెనడాలకు చెందిన రచయితలతో సహా, ఇంగ్లీషు, పోర్చుగ్రీసు, ఫ్రెంచ్ సాంప్రదాయాలగురించి ఇదే అనుకుంటారని నేను అనుకుంటాను. లాటిన్ అమెరికాలోని రచయితల ప్రత్యేకస్థితిని అర్థం చేసుకోవడానికి మనం జపనీస్, చైనీస్, అరబిక్

**బి. తిరుపతిరావుగారు** విజయవాడ సిద్ధార్థ ఆర్ట్స్ & సైన్స్ కళాశాలలో ఆంగ్లశాఖలో అధ్యాపకులుగా ఉంటున్నారు.

రచయితలు వివిధరకాల యూరోపియన్ సాహిత్యాలలో ఏర్పరచుకున్న సంబంధాన్ని గురించి ఆలోచించాలి. ఆసంబంధం బహుళభాషల్ని, నాగరికతల్ని దాటివచ్చినసంబంధం. మనసంబంధం ఒకే భాషల మధ్య చోటు చేసుకుంటుంది. మనం యూరోపియన్లం, యూరోపియన్లం కాదుకూడా. మరిమనం ఏమిటి? మనం ఏమిటో నిర్వచించటం కష్టం. మన మేమిటో మన రచనలు మనకి చెబుతాయి.

సాహిత్య రంగంలో (లాటిన్) అమెరికన్ సాహిత్యంలో ముందుకురావటం అనేది ఈ శతాబ్దపు గొప్ప నూతనత్వం. మొదట ముందుకు వచ్చింది ఇంగ్లీషు మాట్లాడే భాగం. ఇరవయ్యోశతాబ్దపురెండు భాగాలలో ముందుకువచ్చిన స్పానిష్ అమెరికా, బ్రెజిల్ అనే రెండు విభాగాలతో కూడిన లాటిన్ అమెరికా. ఈ మూడు విభిన్నమైనవి అయినప్పటికీ ఈ మూడు సాహిత్యాలమధ్య ఒక సామాన్య లక్షణం వుంది, అది సంఘర్షణ. ఈ సంఘర్షణ విశ్వజనీనతకు ప్రాంతీయధోరణులకూ మధ్య, యూరోపియన్ వాదానికి అమెరికన్ వాదానికి మధ్య. ఈ సంఘర్షణ సాహిత్య సంబంధమైనదనటం కంటే ఎక్కువ భావజాల సంబంధమైంది. ఈ విభేదపు క్రమం ఏమిటి? సిద్ధాంత చర్చలు అంతార్ధనం అయ్యాయి. ఇప్పుడు మిగిలింది రచనలు మాత్రమే. ఈ ఒక్క సాధారణపోలిక తప్ప. ఈ మూడు రకాల సాహిత్యాలమధ్య తేడాలు మౌలికమైనవి. బహుళమైనవి. వీటిలో ఒకటి సాహిత్యానికంటే చరిత్రకి ఎక్కువగా చెందింది. ఆంగ్లో అమెరికన్ సాహిత్యం అమెరికా అగ్రరాజ్యంగా పెరగటంతో పెరుగుతూవచ్చింది. ఇది మళ్ళీ వొక్కసారి చారిత్రక సాంఘిక నియతివాదపు పరిమితిని రుజువుచేస్తుంది. సామ్రాజ్యాలపతనం, కొన్నిసార్లు సాంఘికకల్లోలాలు, కళాసాహిత్యాల వైభవోపేతమైన స్థితిలో సమానంగా జరుగుతుంది.

లాటిన్ అమెరికన్ సాహిత్యానికి, అమెరికన్ సాహిత్యానికి, ఆంగ్లో అమెరికన్ సాహిత్యానికి మధ్యవున్న తేడాల్లో మౌలికమైనది వాటిపుట్టుకల్లోవున్న విభిన్నత. మా సాహిత్యం ఒకరకంగా యూరోపియన్ సంప్రదాయంనుండి విడిగావుంటుంది. విడిగావుంటుందనే ఈ స్పృహ మా ఆధ్యాత్మిక చరిత్రకివున్న నిరంతర లక్షణం. ఈ విడిగా వుందనే భావన స్పానిష్ అమెరికన్‌లకి చెందింది. ప్రత్యేక లక్షణంకాక ప్రపంచకం మొత్తానికి చెందింది అనేది నిజం. ఈ భావన మాకు పుట్టుకతోనే వచ్చింది. సమూహంనుంచి మమల్ని విడగొట్టటం వలన మేం ఒక పరాయి ప్రాంతంలో పడిపోయాం. ఈ అనుభవం ఎప్పటికీ మాయనిగాయం అవుతుంది. అది ప్రతి మనిషికీ కొలవటానికి సాధ్యంకాని లోతుఅయింది. మా సాహసాలు, వీరోచితచర్యలూ, స్వప్నాలూ అన్నీ కూడా ఈ ఎడబాటును అధిగమించి మిగతా ప్రపంచంతో, తోటి మానవులతో, మళ్ళీ ఏకంకావటానికి రూపొందించుకున్న వంతెనలు. ఈ విధంగా ప్రతిమనిషీజీవితాన్ని, మానవజాతి సమూహచరిత్రనీ, వాస్తవస్థితిని పునర్నిర్మించుకునే ప్రయత్నాలుగా చూడవచ్చు. విడిపోయినస్థితికి ఇది అసంపూర్ణమూ అనంతమూ అయిన పరిష్కారం. మాకు అస్తిత్వస్థితి తనకుతాను చారిత్రక పరిభాషలో వక్తీకరించటం అనే వాస్తవాన్ని నొక్కిచెప్పటం నా ఉద్దేశం. ఆవిధంగా అది మాచరిత్ర ఎరుక అవుతుంది. ఈ అనుభవం ఎప్పుడు ఎలా ప్రత్యక్షం అయింది, చైతన్యంలో ఎలామార్చబడిందీ, ద్విముఖంగా వున్న ఈ ప్రశ్నకి సమాధానం సిద్ధాంత రూపంలోనూ, వ్యక్తిగతమైన సాక్షాలతోనూ ఇవ్వవచ్చు. నేను రెండవదాన్నే ఎంచుకుంటాను. సిద్ధాంతాలైతే చాలావున్నాయి. ఏదీకూడా ఆమోదయోగ్యంగాలేదు.

ఎడబాటు అనే అనుభవం నాజ్ఞాపకాల్లో అతిపురాతనమైనది. అది అస్పష్టమైనది. ప్రతి శిశువులాగే ప్రపంచంతోనూ, ప్రజలతోనూ సంపర్కంకలిగించుకోవటానికి నేను ఊహల్లో ఉద్విగ్న భరితమైన వంతెనల్ని నిర్మించుకున్నాను. నేను మెక్సికో నగరానికి శివార్లలోవున్న చిన్నపట్టణంలో జీర్ణావస్థలో వున్న ఒక ఇంట్లోవున్నాను. ఆ ఇంటి చుట్టూ అడవిలాగా పెరిగిన తోటవుంది. ఆ ఇంట్లో ఒకగది పూర్తిగా పుస్తకాలతో నిండివుంది. నా ప్రపంచానికి ఆతోట కేంద్రం అయింది. ఆ పుస్తకాలగది నన్ను సమ్మోహితుణ్ణి చేసే గుహ అయింది. అక్కడే నేను నా మిత్రులతో ఆడుకుంటూ, చదువుకుంటూ గడిపేవాణ్ణి. కాలం స్థితి స్థాపకమైనది. స్థలం తిరిగేచక్రం. సమస్తకాలం, గతం, భవిష్యత్తు, వాస్తవం, ఊహాత్మకం ఏదైనా శుద్ధవునికిగా వుండేది. స్థలం అనంతంగా తననితాను మార్చుకుంటూ వుండేది. అందనివన్నీ అందుబాటులో వుండేవి. లోయ, పర్వతం, సుందరంగా కనిపించే ప్రదేశం, చిత్రాలతో నిండిన పుస్తకాలు ముఖ్యంగా చరిత్రపుస్తకాలు, ఎడారుల్ని, అడవుల్ని, రాజుల్ని, యోధుల్ని, యువరాజుల్ని అద్భుతంగా చిత్రించిన పుస్తకాలు అందుబాటులో వుండేవి. ఆపుస్తక ప్రపంచంలోపడి మేము సింద్‌బాద్‌లాగా, రాబిన్‌సన్ క్రూసోలాగా మారిపోయేవాళ్ళం. వాళ్ళ అనుభవాలు మావి అయ్యేవి. ప్రపంచం అనంతం అనిపించేది. అయినప్పటికీ అది మా అందుబాటులోనే వుండేది. కాలం చెదరని వర్తమానాన్ని అల్లిన మెత్తని పదార్ధం.

ఈ మంత్రముగ్ధత్వం ఎప్పుడు విచ్ఛిన్నమైంది? ఇది హఠాత్తుగా కాక క్రమంగా జరిగింది. మిత్రుడు చేసిన మోసాన్ని, ప్రేమించిన స్త్రీ చేసిన వంచనని, స్వేచ్ఛ అనే భావన నియంత ముసుగు అనే వాటితో సమాధానపడటం కష్టం. ఏమైనప్పటికీ ఒక సంఘటన నాకింకా బాగాగుర్తు. అప్పుడు నాకు ఆరేళ్ళుంటాయి. నాకంటే పెద్దదయిన మా సోదరి ఉత్తర అమెరికాలోని పత్రికలో ఒకఫోటో చూపించింది. అందులో సైనికులు చాలామంది ఒకపెద్దవీధిలో మార్చింగ్‌చేసుకుంటూ పోతున్నారు, బహుశా అది న్యూయార్క్ కావచ్చు. 'వాళ్ళుయుద్ధంనుండి తిరిగివచ్చారు' అంది. ఆ కొద్దిమాటలు నన్నుకల్లోలపరిచాయి. ఆ మాటలు నాకు ప్రపంచాంతాన్ని లేక క్రీస్తు రెండోదీరాకని ఊహించినట్లయింది. నాకు చాలా అస్పష్టంగా మాత్రం తెలిసిందేమిటంటే ఎక్కడో దూరప్రాంతంలో యుద్ధం కొన్ని సంవత్సరాలు ముందేముగిసి సైనికులు విజయోత్సవాన్ని జరుపుకోవటానికి తిరిగివస్తున్నారని. నాకు సంబంధించినంతవరకు ఆ యుద్ధం ప్రస్తుతం యిక్కడ కాకుండా ఎక్కడో వేరే కాలంలో జరిగినట్టు అనిపించింది. ఆఫోటో నా అభిప్రాయం తప్పని నిరూపిస్తుంది. నిశ్చింతగా నేను వర్తమానం నుంచి వేరుచేయబడ్డట్టు అనిపించింది.

ఆక్షణంనుంచి నిరంతరం కాలం మరింతగా విచ్ఛిన్నమౌతున్నట్టు అనిపించింది. కాలపు బహుళత్వం గోచరిస్తూవుంది. ఆ అనుభవం తననితాను పునరుక్తి చేసుకుంటూవుంది. ఒక చిన్నవార్త, ప్రమాదరహిత పదబంధం, పత్రికలలో పతాకశీర్షిక- ప్రతిదీకూడా బయటప్రపంచపు వాస్తవాన్ని నా అవాస్తవికతని రుజువుచేస్తూవున్నాయి. ప్రపంచం చీలిపోతున్నట్టు, నేను వర్తమానంలో వుండలేనట్టు అనిపించింది. నావర్తమానం పతనం అయిపోతోంది. నిజమైనకాలం ఎక్కడవుంది అనిపించింది. నాకాలం అంటే తోట, ఆటలు, స్నేహితులు, చెట్లమధ్య ఆటలు మొదలయినవి. అంతాకూడా కల్పితకాలం అయింది. నా ఇంద్రియాలు నాకేమీ చెప్పినప్పటికీ బయటకాలం, ఇతరులకిచెందినకాలం, నిజమైన వర్తమానకాలం అని అనిపించింది. ఇకనేను దాన్ని ఆమోదించక తప్పలేదు. నేను పెద్దవాణ్ణి అయ్యాను. వర్తమానం నుంచీ నేను వెళ్ళగొట్టబడటం ఇలా జరిగింది.

వర్తమాన అన్వేషణ భూలోక స్వర్గంకోసం కానీ, కాలాతీతమైన శాశ్వతత్వం కానీకాదు. అది నిజమైన వాస్తవికత కోసం అన్వేషణ. స్పానిష్ అమెరికన్‌లమైన మాకు నిజమైనవర్తమానం మాసొంత దేశాలలో లేదు. అది ఇంగ్లీషువాళ్ళు, ఫ్రెంచ్‌వాళ్ళు, జర్మన్‌వాళ్ళు నివసించిన కాలంలో వుంది. అదిన్యూయార్క్, పారిస్, లండన్‌లకాలం. మేము అక్కడవెళ్ళి ఆకాలాన్ని మాతోపాటు తీసుకురావాల్సి వచ్చేది. ఈ సంవత్సరాలు నేను సాహిత్యాన్ని కనుగొన్న సంవత్సరాలు కూడా. కవిత్వం రాయటం ప్రారంభించాను. కవిత్వాన్ని రాయటానికి ఏది కారణం అయిందో నాకు తెలియదు. వర్ణించటానికి అసాధ్యమైన అంతర్ప్రపంచపు అవసరం ఏదోనన్ను కదిలించింది. కేవలం యిప్పుడు మాత్రమే వర్తమానం నుంచి బహిష్కరణ అని నేను అన్నదానికి కవిత్వం రాయటానికి మధ్య రహస్యసంబంధం వుందనే విషయం అర్థమైంది. కవిత్వం ప్రస్తుతాన్ని ప్రేమిస్తుంది, దాన్ని కవితలో తిరిగి జీవింపజేస్తుంది. తద్వారా అది క్రమానుగత కాలం నుంచి తనను వేరుచేసుకొని, కాలాన్ని నిర్దిష్టవర్తమానంగా మార్చుతుంది. అప్పుడు నేను ఎందుకు రాస్తున్నాను అనే ఆశ్చర్యంలేకుండా రాశాను. వర్తమానానికిక ద్వారాన్ని అన్వేషించటంలో నా రచన అప్పుడు సాగింది. నేను నాయుగానికి, నాకాలానికి చెందాలనుకున్నాను. కొద్ది కాలంతర్వాత ఈ ఆశస్థిరపడింది. నేనొక కవిగావుండాలనుకున్నాను. దాంతో ఆధునికత కోసం నా అన్వేషణ ప్రారంభమైంది.

ఆధునికత అంటే ఏమిటి? మొదటిగా ఆధునికత అనేది సందిగ్ధంతో నిండిన పదం. ఎన్నిరకాల సమాజాలువున్నాయో అన్నిరకాల ఆధునికతలు వున్నాయి. ప్రతి సమాజమూ తన సొంత ఆధునికతను కలిగివుంటుంది. ఆధునికతకు ముందువున్న మధ్యయుగాల లాగే ఆధునికత అర్థం అనిశ్చితంగానూ, అనిర్దిష్టంగానూ వుంది. మధ్యయుగ కాలంతో పోల్చినప్పుడు, మనం ఆధునికం అయినట్లయితే, భవిష్యత్ ఆధునికతతో పోల్చినప్పుడు మనం మధ్యయుగాలకి చెందుతామా? కాలంతోపాటు మరేపేరు నిజమైనపేరౌతుంది? ఆధునికత అనేది తన అర్థాన్వేషణలో వున్నపదం. అది ఒక ఆలోచనా? మృగతృష్ణ? లేక చరిత్రలో ఒకదశ? మనం ఆధునికతకి శిశువులమా? లేక దానిసృష్టికర్తలమా? ఖచ్చితంగా ఎవరికీ తెలియదు. అదేమంత సమస్యా కాదు. ఆధునికతని మనం అనుసరిస్తాం, అనుకరిస్తాం. ఆకాలంలో ఆధునికత అంటే వర్తమానంలో కరిగిపోయేది, లేకపోతే వర్తమానాన్ని సృష్టించేది. వర్తమానం ఆధునికతకి పూచిన చివరి వున్నతమైన పువ్వు. ప్రతీకవాద యుగం నుంచి ఆధునికకవులందరూ తమని ఆకర్షించిన అయస్కాంతంలాంటి, చిక్కనటు వంటి ఆధునికతని వెంటాడుతూనే వున్నారు. బోదలేర్ వాళ్ళలో మొదటివాడు. ఆధునికతను మొదట స్పృశించిన వాడు. ఆధునికత అంటే చేతుల్లో కరిగిపోయేకాలం తప్ప వేరుకాదని కనుగొన్నవాడు కూడా బోదలేర్. ఆధునికతాన్వేషణలో నా సాహసాల్ని నేను చెప్పబోవటంలేదు. అవి ఇరవయ్యో శతాబ్దపు ఇతర కవుల సాహసాలకంటే భిన్నంగాలేవు. ఆధునికత విశ్వజనీన వాంఛగా వుంటూవచ్చింది. 1850ల నుంచి ఆధునికత మన దేవతగానూ, దెయ్యంగానూ కూడా వుంటూవచ్చింది. ఈ మధ్య సంవత్సరాలలో ఆధునికత దెయ్యాని వదిలించే ప్రయత్నం జరుగుతుంది. అలాగే ' ఆధునికానంతర వాదం' గురించిన సంభాషణ విరివిగా వినబడుతూ వుంది. మరింత ఆధునిక ఆధునికత కాకపోతే ఆధునికానంతర వాదం ఏమిటి?

లాటిన్ అమెరికాకు చెందినమాకు కవితాత్మక ఆధునికతా అన్వేషణ చారిత్రకంగా మాదేశాల్ని

ఆధునికీకరణ చెయ్యటానికి మళ్ళీమళ్ళీ జరిగిన ప్రయత్నాలతో సమాంతరంగా నడిచింది. ఈ ధోరణి పద్దెనిమిదో శతాబ్దపు చివరినుండి ప్రారంభం అయింది. 1830లకి అమెరికా ఆధునికతలో పుట్టింది. డిటాక్విలీ మాటల్లో చెబితే భవిష్యత్తుకకిగర్వంగావుంది. స్పెయిన్, పోర్చుగల్ ఆధునికతకి దూరంగా జరిగిపోతున్నదశలో మేం ఆధునికతలోకకి అడుగుపెట్టాం. అందుకే మాదేశాల్ని యూరోపీకరించాలనే మాటలు తరచుగా వినిపిస్తూ వుండేవి. మెక్సికో చరిత్రలో ఆధునికీకరణ క్రమం స్వాతంత్ర్యయుద్ధానికి కొంచెం ముందుగా మొదలైంది. ఆధునికతకోసం చూసే అన్వేషణ మమ్మల్ని మాగతాల్ని కనుగొనేటట్లు చేసింది, దాగివున్న మాదేశ స్వరూపాన్ని గుర్తించేటట్లు చేసింది. అనూహ్యమైన ఈ చారిత్రకపాఠం అందరూ నేర్చుకున్నారోలేదో నాకు తెలియదు, ఆ పాఠం ఏమిటంటేసంప్రదాయానికి ఆధునికతకి మధ్య వంతెనవుందనేది. ఈరెండూ ఒకదానికొకటి దూరం. అయితే సంప్రదాయం నిలువనీరైపోతుంది, ఆధునికత ఆవిరైపోతుంది. ఈ రెండింటి కలయికవల్ల ఆధునికత సంప్రదాయంలో జీవాన్ని నింపుతుంది. సంప్రదాయం గాఢతతోనూ, ఆకర్షణతోనూ మిగిలివుంటుంది.

దిగంతాలకు విస్తరించిన, ఇంద్రియక సుఖ ప్రజ్ఞా సమన్వితమైన, మానవతా నిజాయితీతో గాఢ రాగ రంజితమైన రచనలు'' ఆయన చేసినందుకు ఆయనకు నోబెల్ బహుమానం ఇవ్వడమైందని స్వీడిష్ అకాడెమీ ప్రకటించింది. అసలు ఆకెవియోపాజ్ అంటే పరాయితనం; వర్తమానం కోసం అన్వేషణ. అతనికి చాలా కాలంగా నోబెల్ బహుమతి వస్తుందని చాలమంది అనుకొన్నారు. ఈ బహుమతిరావడంలో అతని ంది.

అకెవియోపాజ్, మెక్సికోలో, ప్రథమ ప్రపంచ మహాసంగ్రామం, మెక్సికన్ విప్లవాలు చేసిన గాయాల మచ్చలతో నిండిన 1914 సంవత్సరంలో మార్చి 31న ఆక్టేవియో, జోసెఫినా లోజోనోపాజ్‌లకు జన్మించాడు. 1962 నుంచి 68వరకు భారతదేశంలో రాయబారిగా ఉన్నాడు. తన 17వ యేట 1931లో మొదటి పద్యాన్ని ప్రచురించాడు. మొదటి పద్య సంపుటి **'Rustic Moon'** ని 1933లో ప్రచురించాడు. 1949లో **Liberty under parole** ను, 1950లో **The Labyrinth of Solitude** ను ప్రచురించాడు. అనేక పత్రికలకు సంపాదకుడుగా పనిచేశాడు బహుమతులను గెలుచుకొన్నాడు.

- సంపాదకుడు

కవితాత్మ ఆధునికతకు చేసే అన్వేషణ ఒక పరిశోధనలాంటిది. ఆధునికత కేవలం ఒక కవితా పాఠశాలకాదు. ఒక పరంపర. అనేక ఖండాలకి విస్తరించిన ఒక కుటుంబం. ఈ కుటుంబం రెండు శతాబ్దాల పాటు అనేక అనూహ్యామార్పుల్ని, దురదృష్టాల్ని భరించింది. ప్రజల అయిష్టాన్ని, పిరికితనాన్ని, మత, రాజకీయ, లైంగిక సంప్రదాయ విచారణల్ని తట్టుకుంది. కారణం ఆధునికత ఒక సిద్ధాంతం కాదు, సంప్రదాయం. అది చొరబడటమేకాదు, మారటంకూడా చేస్తూ వచ్చింది. అందువల్ల ఆధునికత విభిన్నమైన అంశాలుకలది. ప్రతి ఆధునిక కవిత సాహసం విలక్షణమైనది. మాట్లాడే వృక్షాలతో నిండిన అద్భుతమైన అడవిలో ప్రతికవి ఒక విభిన్నమైన మొక్కని నాటుతూ వచ్చాడు. ఈ కవులందరినీ కలిపేది కళాత్మకత కాదు, అన్వేషణ. నా అన్వేషణ ఊహాత్మకమైనది

కాదు. ఒక రోజు నేను నా అన్వేషణలో ముందుకు పోవటం కాక ప్రారంభకేంద్రం దగ్గరికి వెనక్కి ప్రయాణిస్తున్నానని గుర్తించాను. ఆధునికతా అన్వేషణ మూలాల్లోకి పోవటం అనేదాన్ని కనుగొన్నాను. ఆధునికత నన్ను నా ప్రారంభపు మూలాల్లోకి నడిపించింది, నా ప్రాచీనతలోకి దారి చూపించింది. ఎడబాటు ఇక రాజీపడటం అయింది. తరాల లయబద్ధ ప్రవాహంలో కవి నాడిలాంటి వాడని నేనప్పుడు కనుగొన్నాను.

ఆధునికత అనే భావన క్రమంగా క్షీణించటం మనం గమనిస్తున్నాం. ఆధునికానంతరత ప్రాచుర్యం పొందుతోంది. రెండు శతాబ్దాలపాటు మానవుల్ని నడిపించిన భావాలు, విశ్వాసాలు సంక్షోభంలో పడిపోయాయి. మన ప్రకృతి పరిసరాలమీద మనం బాగుచేయలేని అనేకగాయాల్ని చేశాం. మానవజాతి మనుగడకే ప్రమాదం ఏర్పడింది. ప్రగతికి సాధనాలుగా నిలిచిన శాస్త్ర, సాంకేతిక రంగాలు చాలా స్పష్టంగా విధ్వంసక శక్తులుగా మారిపోయాయి. న్యూక్లియర్ ఆయుధాల ఉనికి చరిత్రలో ప్రగతి అనివార్యం అనే ఆలోచనని ఖండిస్తూ వుంది.

రెండు ప్రపంచయుద్ధాలు. అయిదు ఖండాల నిండా వున్న నియంతృత్వాలు, మానవజాతి కనీవినీ ఎరుగని పరమదుర్మార్గమైన కాన్సన్ట్రేషన్ క్యాంపులు మనం చవిచూశాం. ఆధునిక సాంకేతిక జ్ఞానం అంతులేని ఉపయోగాల్ని చేకూర్చింది, అయితే మనశతాబ్దంలో జరిగిన రక్తపాతం, హింస, అవమానం, పతనం, అమాయక ప్రజలమీద జరిగిన బలప్రయోగం మొదలైన దారుణాన్ని చూడకపోవటం అసాధ్యం.

అలాగే ప్రగతి అవశ్యం అనే నమ్మకం కూడా చెదిరిపోతుంది. మన తాతలకి, తండ్రులకి చరిత్ర శిధిలాలు చరిత్రక్రమం పట్ల నమ్మకాన్ని పోగొట్టలేకపోయాయి. నియంతృత్వాలు, ఘర్షణలు, ఆటవిక అంతర్యుద్ధాలు ప్రగతికి మనం చెల్లించిన మూల్యాలు. చరిత్ర దేవుడికి రక్తధనాన్ని మనం అర్పించాం. దేవుడా! అవును. అవును. హేతువు దైవీకరింపబడింది. చరిత్ర హేతుబద్ధత అంతర్ధానం అయింది.

చరిత్రక్రమాన్ని నిర్మించేసూత్రాన్ని ఆవిష్కరిస్తామని చెప్పిన తాత్విక, చారిత్రక నిర్ధారణలన్నీ చెల్లాచెదురయ్యాయి. చరిత్ర తాళాలు తమ దగ్గర వున్నాయని నమ్మిన విశ్వాసులు శవాల పిరమిడ్లమీద బలవంతమైన రాజ్యాల్ని నిర్మించారు. మనిషి విముక్తం చేయటానికి ఉద్దేశించిన సిద్ధాంతాలు అత్యాశాపూరితమైన నిర్మాణాలు చాలా త్వరగానే విశాలమైన జైళ్ళుగా మారాయి. ఇవాళ మనం అవి కూలిపోవటం చూస్తున్నాం. వీటిని కూల్చివేస్తుంది వాటి సైద్ధాంతిక శత్రువులుకాదు. కొత్తతరాల అసహనం, స్వేచ్ఛపట్ల వాంఛ. ఇది ఊహాత్మక సిద్ధాంతాల ముగింపో? దీన్ని చారిత్రకక్రమ ఫలితాల్ని ముందుగానే తెలుసుకోవచ్చనే ఆలోచను అంతంగా అర్థంచేసుకోవచ్చు. చారిత్రక నియతివాదం విలువైన రక్తంతో తడిసిన స్వైరకల్పనగా మిగిలింది. చరిత్రకి కర్త అయిన మానవజాతి మూర్తీభవించిన అనియతవాది. అందువల్ల చరిత్ర అనూహ్యంగా వుంటుంది.

ఈ పై సంక్షిప్త వివరణ మనం ఒక చారిత్రకదశ అంతరించే సమయంలోనూ, మరొకదశ ప్రారంభంలోనూ వున్నాయని తెలుస్తుంది. ఇది ఆధునిక యుగ అంతమా? లేక పరివర్తనా? చెప్పటం కష్టం. ఏదైనా ఊహాత్మక పథకాల అంతం ఒక గొప్పశూన్యాన్ని మిగిల్చాయి. అయితే ఈ మిగల్చటం ఈ భావజాలం వైఫల్యం చెందింది అని పజువుచేయబడిన దేశాలలోకాదు, దాన్ని చాలా ఉత్సాహంతో, ఆశతో కావలించుకున్న దేశాలలో చరిత్రలో మొదటి సారిగా మానవజాతి ఆత్మికఅరణ్యంలో నివసిస్తోంది. ఇది వరకటిలాగా మనల్ని ఉపశమింపజేస్తూ, అదేకాలంలో

అణచివేస్తూవున్న మత, రాజకీయ వ్యవస్థలలో కాదు. ప్రతి సమాజం చారిత్రకం అయినప్పటికీ, ప్రతిసమాజం అధిచరిత్ర నమ్మకాలతో, ఆలోచనల ప్రేరణతో నడిచింది. అధిచరిత్ర సిద్ధాంతం లేకుండా జీవించటానికి సిద్ధంగావున్న మొదటియుగం మనదే. ఈ సిద్ధాంతం మత, తాత్విక, నైతిక, కళాత్మకత దేనికైనా చెందినది కావచ్చు. మన అఖండ సిద్ధాంతాలు సామూహికం కాదు వ్యక్తిగతం. ఇది ప్రమాదకర అనుభవం కావచ్చు. మనుషుల్లో మళ్ళీ ఆదిమ ఉద్రేకాలు తలెత్తవచ్చు. దురదృష్టవశాత్తు పరిస్థితులు ఆందోళనకరంగానే వున్నాయి.

భావజాలాల పతనం అని నేనన్న వాక్యంలో నా అర్థం చరిత్రకి ఒకలక్ష్యం, ఒకగమ్యాన్ని వుద్దేశించిన సిద్ధాంతాలు అని. వీటిని చరిత్రాతీతమైనవి అనికూడా అన్నాను. సమస్యలకి విశ్వజనీన పరిష్కారాలకి కాలం చెల్లిందనికూడా పై వాక్యం సూచిస్తుంది. దాన్ని గమనించి మనం నిర్దిష్ట సమస్యలకి, నిర్దిష్టపరిష్కారాలు వెతకాల్సి వుంటుంది. ముందుకెళ్ళిన ప్రజాస్వామిక సమాజాలు అసూయపడాల్సిన స్థాయిలో సంపద స్థాయిని పెంచుకున్నాయి; అదే సందర్భంలో ఇవి విశ్వవ్యాప్త దుఃఖం అనే మహాసముద్రంలో సంపదనిండిన ద్వీపాలు మాత్రమే. అమలులో వున్న మార్కెట్ వ్యవస్థ పరిసరాల పతనానికి కారణం అవుతుంది. కాలుష్యం గాలిని, నదుల్ని, అడవుల్నే కాదు మనహృదయాలకి కూడా సోకుతుంది. మతి తప్పిన సమాజం ఎక్కువ వినియోగానికి ఎక్కువగా వుత్పత్తిచేసే అవసరం వైపు నెట్టబడుతోంది. ఇది క్రమంగా భావాల్ని, అనుభవాల్ని, కళని, ప్రేమని, స్నేహాన్ని, మొత్తంగా మనుషుల్ని వినిమయ వస్తువులుగా మార్చుతుంది. ప్రతిదీ కొనాల్సిన వస్తువుగా, వాడి చెత్తలో పడేయాల్సిన వస్తువుగా మారుతుంది. మన సమాజం అంత చెత్తని ఏ సమాజము ఉత్పత్తి చేయలేదు. ఈ చెత్త వస్తు ప్రపంచానికీ నైతిక ప్రపంచానికి కూడా చెందుతుంది.

వర్తమానాన్ని గురించి ఆలోచించాలంటే భవిష్యత్తును వదులుకోవాల్సి వుంటుంది, గతాన్ని మర్చిపోవాల్సివుంటుంది. కాలపు మూడుదిశలూ కలిసే సంగమస్థలం వర్తమానమే. ఆనంద వృక్షం గతంలోనూ, భవిషత్తులోనూకాక ప్రస్తుతంలోనే పెరుగుతుంది. అయితే మృత్యువుకూడా వర్తమాన ఫలమే. అది జీవితంలో భాగం దాన్ని తిరస్కరించటం సాధ్యం కాదు, బాగా జీవించటంలో బాగా మరణించటంకూడా అది అనుభవంలోకి వస్తుంది. గతం, భవిష్యత్తు, శాశ్వతత్వం, శూన్యం మొదలైన వాటిగురించి మనకు తత్వశాస్త్రాలో వున్నట్టుగానే, రేపు మనకి వర్తమానానికి చెందిన తత్వశాస్త్రం ముందుకు వస్తుంది. కవితాత్మక అనుభవం దాని పునాదుల్లో ఒకటి కావచ్చు. వర్తమానాన్ని గురించి మనకేం తెల్సు, ఏమీ తెలియదు. అయితే కవులకి ఒకటి తెలుసు. ఉనికి మూలం వర్తమానమే అని తెలుసు.

ఆధునికతకోసం నేను చేసిన ఈ యాత్రలు నన్ను నేను మళ్ళీ కనుగొనటం కోసమే నామార్గాన్ని అనేకసార్లు తప్పాను. మూలంలోకి తిరిగివచ్చి ఆధునికత మనబయటలేదు, మనలోపలే వుందనే విషయాన్ని గ్రహించాను. ఆధునికతని దాని నిరంతర మారువేషాల్లో మనం వెంబడిస్తూ వుంటాం. అయినప్పటికీ దాన్ని మనం బంధించలేం. అది నిరంతరం తప్పించుకుంటూ వుంటుంది. మనం దాన్ని కౌగలించుకుంటాం, హఠాత్తుగా అది అంతర్థానం అవుతుంది. దాన్ని సజీవంగా బంధించాలని మనం ప్రయత్నిస్తాం, అది రెక్కలొచ్చి ఎగిరిపోతుంది. మనచేతుల్లో శూన్యం మిగులుతుంది. అప్పుడు నెమ్మదిగా మన జ్ఞానద్వారాలు తెరుచుకుంటాయి. మనకు తెలియకుండానే మనం అన్వేషిస్తూవున్న నిజమైన, ఇతరకాలం మనముందు ప్రత్యక్షం అవుతుంది, అదే వర్తమానం, అదే వునికి

# నేను ముస్లింను ఎందుకు కాదు?

408

Why I am not a Moslem by IBN WARRAQ,

(Pub:- Promethus Books, U.S.A.)

– ఎన్. ఇన్నయ్య

కథ చెప్పడమే గాదు, వినడంకూడా చేతకావాలన్నాడు రాచకొండ విశ్వనాథ శాస్త్రి. పుస్తకాలు రాయడం ఒక ఎత్తు. వాటిని అచ్చు వేయడానికి ధైర్యం కావాలి. సాల్మన్ రష్దీ, తస్లీమానస్రీన్ (బంగ్లాదేశ్ ''లజ్జ'' రచయిత్రి) రచనలు వెలువడిన తరువాత, చాలా మంది ప్రచురణకర్తలు వివాదాస్పద రచనలంటే భయపడుతున్నారు. ముఖ్యంగా ముస్లింలను, మహమ్మద్, కొరాన్, ఇస్లాం చట్టాలను విమర్శించే గ్రంథాల జోలికి పోకూడదనుకుంటున్నారు. అలాంటి సందర్భంలో అమెరికాలోని హ్యూమనిస్టు ప్రచురణ సంస్థ ప్రామిథిస్ వారు ధైర్యంగా యీ పుస్తకాన్ని యిటీవలే వెలువరించడం ఆహ్వానించదగిన మార్పు.

పుస్తకరచయిత ముస్లిం. ఇస్లాంను బయటివారు విమర్శించిన రచనలు చాలా వున్నాయి. వాటిని ముస్లింలు అంతగా పట్టించుకోరు. కాని తమలోని ఒక వ్యక్తి విమర్శిస్తే, చంపేసే వరకూ, అమానుషంగా ప్రవర్తిస్తారు. శటానిక్ వర్సెస్ రాసిన సాల్మన్ రష్దీని చంపేయమని ఇస్లాం అధిపతి అయొతుల్లా ఖొమిని ఉత్తర్వులు జారీచేశారు. బంగ్లాదేష్‌లో తస్లీమా నస్రీన్‌కు తలదాచుకునే అవకాశం లేక, స్వీడన్‌కు పారిపోవాల్సిన దుర్గతి పట్టించారు. వారి పుస్తకాలను నిషేధించారు. మళ్ళీ యీ దేశాలన్నీ మానవ హక్కుల పత్రం పాటిస్తామని సంతకాలు చేసిన వారే! ఇబన్ వారక్ రచన చాలా లోతుపాతులతో, నిశిత పరిశీలనతో, అనేక మంది రచయితలను పట్టి చూచి రాసిన గ్రంథం. అంతా అయిన తరువాత ఇక తాను ముస్లింగా వుండలేనంటున్నాడు. అది ధైర్యానికి నిదర్శన ప్రకటన.

బెర్ట్రాండ్ రస్సెల్ నేనెందుకు క్రైస్తవుణ్ణికాదు అనే రచన చేస్తే ప్రపంచంలో ఇతర మతస్తులు మెచ్చుకున్నారు. ఇబన్ వారక్ అంటాడు. రసెల్ రచనలో క్రీస్తుకు బదులు అల్లాను పెడితే, అదంతా ముస్లింలకు యథా తథంగా వర్తిస్తుంది. అలాగే అన్ని మతాలకూ చెందుతుంది. నేనెందుకు హిందువును కాలేదు అని యిటీవల రామేంద్ర బీహార్‌కుండి ఒక రచన ప్రచురించాడు. అదికూడా రసెల్, ఇబన్ వారక్ ధోరణిలోదే.

ఈ రచనలో 17 అధ్యాయాలు వున్నవి. ఇబన్ వారక్ చాలా పరిశోధన చేసి ప్రతి అంశాన్ని పట్టిచూచి, రాశాడు. రష్దీవ్యవహారంతో తొలి అధ్యాయం ఆరంభమౌతుంది. 1989 ఫిబ్రవరిలో ఇరాన్ అధిపతి అయొతుల్లా ఖొమిని ఫత్వాజారీ చేసి సాల్మన్ రష్దీని చంపమన్నాడు. పాశ్చాత్యులలో కొందరు ముస్లింలను దువ్వడానికిగాను యీ చర్యను సమర్థించారని, ఖొమిని చర్యను ఖండించలేక పోయారని ఆయన చూపారు. ఫ్రెంచి తత్వవేత్త ఫూకోసైతం ఖొమిని చర్యల్ని ఆహ్వానించి, ఇరాన్‌లో దారుణాల పట్ల కళ్ళు మూసుకున్నట్లు రచయిత ప్రస్తావించారు. శాస్త్రీయ రంగంలో

---

**డా. యన్. ఇన్నయ్య**, సుప్రసిద్ధ పాత్రికేయుడు. ప్రస్తుతం అమెరికాలో ఉన్నారు.

పరిశోధనలు, రుజువులు, ప్రగతిని కొంత వరకు క్రైస్తవులు స్వీకరించి, మత ఛాందసాన్ని సవరించారని, ఇంకా ముస్లింలు ప్రారంభించ లేదని రచయిత అన్నారు. అయితే శాస్త్రీయ ఉప్పెనకు కొరాన్ తట్టుకోలేదని కూడా ఆయన అన్నాడు.

రెండో అధ్యాయంలో ఇస్లాం పుట్టుపూర్వోత్తరాలు, యూదు క్రైస్తవ మతాల, గ్రంధాల ప్రభావం సుదీర్ఘంగా చర్చించారు. విగ్రహారాధన వ్యతిరేకించే ముస్లింలు మక్కాలో ''కాబా'' నల్లరాతిని ప్రతిష్టించి, ఆరాధించే రీతులు ఎలా వచ్చాయో వివరించారు. ఇది ఆకాశంనుండి వూడి పడిన ఉల్క అని కీ॥శే॥ కారల్ శాగన్ రాశారు. మక్కా మీదుగా ఎమెన్, సిరియా వెళ్ళే ఒంటె వ్యాపారస్తులు కాబావద్ద ఆగి, పక్కనే వున్న ఊట బావి నీటితో సేద తీర్చుకొని వెళ్ళేవారని రచయిత పేర్కొన్నారు.

మూడో అధ్యాయంలో మూలాధారాల పరిశీలనలో ఎదుర్కొంటున్న సమస్యల్ని, రచయిత కూలంకషంగా చూచారు. ఖురాన్ గురించి ముస్లిం సనాతనులు చెప్పే అబద్ధాల మొదలు, మహమ్మద్, సంప్రదాయాల వెనుక ఎంత వరకు నిలబడగల చరిత్ర వుందో చూపారు.

నాలుగో అధ్యాయంలో మహమ్మద్ సందేశాలను రచయిత విప్పి చూపారు. మహమ్మద్ గురించి రాసిన వాళ్ళలో చాలా మంది వ్యతిరేకులు కాదని, అయినా వాస్తవాలు తెలిపారనీ, ముస్లింలు అదంతా గ్రహిస్తే అంత అభిలషించరని రచయిత అన్నారు. మహమ్మద్‌లో మక్కా కాలంలో మహమ్మద్ చిత్త శుద్ధిగల మత నమ్మకస్తుడుగా వున్నాడు.

ఖురాన్‌గురించి ఐదవ అధ్యాయం విపులంగా పరిశీలిస్తుంది. ముస్లింలు ఖురాన్ పవిత్రమనీ, దైవదత్తమనీ, ప్రత్యక్షర సత్యమనీ నమ్ముతారు. అలాంటి గ్రంథంలో పరస్పర విరుద్ధాలు, ప్రక్షిప్తాలు, భిన్న పాఠాంతరాలు వుండడాన్ని రచయిత చూపాడు. ఖురాన్ సూచించే శిక్షలో మానవహక్కుల్ని ఎలా ఉల్లంఘిస్తున్నాయో రచయిత పేర్కొని ఇస్లాం దేశాలన్నీ మానవ హక్కుల పత్రం అంగీకరించిన విషయం గుర్తు చేశారు. బైబిల్ వలె ఖురాన్ కూడా సృష్టివాదం ఒప్పుకోగా, సైన్స్ అందుకువిరుద్ధంగా పరిణామ వాదానికి సాక్ష్యాధారాలు చూపుతున్నది. అలాగే జీవంకూడా.

ఇస్లాంలో నియంతృత్వం ఎలా వుందో రచయిత మరొక అధ్యాయంలో చూపాడు. ఇస్లాం అంతా విధులతో కూడినది. పుట్టిన దగ్గరనుండీ చనిపోయే వరకూ జీవితాన్ని అదుపులో పెట్టడం ఇస్లాం పని. కనుకనే ఇస్లాంలో సెక్యులరిజం లేదు. అంటే మతం - రాజ్యం విడిగా చూడడం లేదు. ఇస్లాం యావత్తూ నాలుగు స్థంభాలపై ఆధారపడుతుంది. ఖురాన్, సున్నా, (ప్రవక్త ప్రవచనాలు), వీటిని గురించి ఒక అంగీకారానికి వచ్చిన ముస్లిం పండితుల మాటలు, ఉపమానాలతో కూడిన వాదన. రచయిత ననుసరించి ఖురాన్ 7-9 శతాబ్దాల మధ్య రాసిందే. ఇందులో యూదు, క్రైస్తవ, జొరాష్ట్రియన్, సమారిటన్ నుండి స్వీకరించి చేర్చినవి చాలా వున్నాయి. ఇందులో శాస్త్రీయంగా నిలబడని దోషాలు, వ్యాకరణ భాషా దోషాలు, కాలదోషం, పరస్పర విరుద్ధ విషయాలు, అసంబద్ధాలు పేగన్ల పట్ల అసహనం, హింస, హత్య, స్త్రీపురుష అసమానతలు, బానిసత్వాన్ని అంగీకరించడు. అమానుష శిక్షలు, మానవ వివేచన పట్ల జుగుప్స వున్నాయి. దైవదత్తమైన వాటిలో యిలా వుండడం అర్థం లేనిదని రచయిత ఉద్దేశం. ఉదారత, తల్లి దండ్రులపట్ల గౌరవం వంటివి వున్నప్పటికీ అసంబద్ధాల మధ్య అవి మునిగిపోయాయి.

ఇస్లాంలో పురోహిత వర్గం లేదని ముస్లిం పండితులు చెబుతారు. కాని ఇస్లాంకు సరైన వ్యాఖ్యానం చేసే, పేరిట, అన్ని చోట్ల పురోహిత వర్గం తిష్ఠ వేసి పెత్తెనం చేస్తున్నది. ఉలేమాలు వీరే. ముస్లింలలో నిశిత పరిశీలన, శాస్త్రీయ దృక్పథం పెంపొందకుండా నిరోధిస్తున్నది యీ ముల్లాలే. వెయ్యేళ్ళ క్రితం ఆనాటి పరిస్థితులలో వచ్చిన హరియా చట్టాలు నేడు చారిత్రకంగా చూడాలేగాని, తుచ తప్పకపాటిస్తే నైతిక ప్రగతి వుండదని రచయిత ఘంటా పథంగా చెప్పారు.

**మానవహక్కులు:** ముస్లిం దేశాలు ఇస్లాంను పాటిస్తూనే, మానవహక్కుల్ని అంగీకరిస్తూ సంతకాలు చేశాయి. ఐక్య రాజ్య సమాఖ్యలో వీరు సభ్యులే. కాని ఆచరణలో అడుగడుగునా మానవ హక్కుల్ని ఇస్లాం అడ్డు కొంటున్నది. ఇస్లాంలో స్త్రీలు పురుషులు సమానం కాదు. పురుషుడి సాక్ష్యంలో సగం మాత్రమే స్త్రీ సాక్ష్యానికి వుంటుంది. స్త్రీలకు అన్ని విధాలా ఇస్లాం పరిమితం చేస్తుంది. ముసుగు వేసుకోమంటుంది. మానవ హక్కుల ప్రకారం స్త్రీ పురుషులకు హక్కులు స్వేచ్ఛ, భావాలు సమానంగా వుండాలి. కాని ఇస్లాం ప్రకారం స్త్రీలు ముస్లింలు కాని వారిని పెళ్ళి చేసుకోరాదు. ముస్లిం దేశాలలో నివశించే ముస్లిమేతరులకు, కోర్టులో గాని, మరెక్కడా సమాన హక్కులు లేవు. ముస్లిం దేశాలలో నాస్తికులు, నమ్మకం లేనివారు చంపబడాల్సిందే. ముస్లిం దేశాలలో ఇతరమతాల వారు తమ ప్రార్థనలు చేసుకోడానికి, బాహాటంగా గుడి, చర్చి నిర్మించడానికి, పవిత్ర గ్రంధాలు చదవడానికి వీల్లేదు. మానవహక్కులు బానిసత్వాన్ని వ్యతిరేకిస్తుండగా ఇస్లాం గుర్తిస్తున్నది. బానిస స్త్రీలతో లైంగిక సంపర్కం ముస్లింలకు ఖురాన్ అనుమతిస్తున్నది. (సురా 4:3)

మానవహక్కుల ప్రకారం క్రూరమైన, అమానుషమైన శిక్షలు, మానవత్వాన్ని దిగజార్చే శిక్షలు వుండరాదు. ఇస్లాం ప్రకారం కొరడాతో బహిరంగంగా కొట్టడం, చేతులు కాళ్ళు నరకడం రాళ్ళు విసరిచంపడం అనుమతిస్తున్నారు. చట్టం ముందు అందరూ సమానమని మానవహక్కులు చెబుతుండగా, ఇస్లాం అందుకు విరుద్ధంగా ప్రవర్తిస్తున్నది. ముస్లింలలో ఇతరులు మతం మార్చుకొని చేరవచ్చు కాని ముస్లింలు మతం మార్చుకొని వేరే పోడానికి వీల్లేదు.

ప్రజాస్వామ్యం - ఇస్లాం పొసగనివని, మానవహక్కులకు ఇస్లాంలో అవకాశం లేదని రచయిత వివరంగా చెప్పారు. ముస్లింలు ఇతర ప్రపంచంతో పాటు ముందుకు సాగడానికి, మతాన్ని రాజ్యాన్ని విడదీసే, సెక్యులరిజం అవసరమని రచయిత అన్నారు.

**స్త్రీలు ఇస్లాం:** స్త్రీలపట్ల ఇస్లాం ఎలా ప్రవర్తిస్తున్నదో చాలా వివరంగా రచయిత ఒక అధ్యాయంలో చర్చించారు. క్రైస్తవుల వలె ఇస్లాంకూడా పురుషుని సృష్టి ముందు జరిగిందని భావించారు. స్త్రీల పట్ల ఇస్లాం చాలా క్రూరంగా, హేయంగా ప్రవర్తించిన ఉదాహరణలు రచయిత చూపాడు.

స్త్రీ బహిష్టు సమయంలో ఖురాన్ తాకరాదు, కాబా చుట్టూ తిరగరాదు, ప్రార్థనచేయరాదు, ఉపవాసం వుండరాదన్నారు. స్త్రీ పురుష అసమానత్వం ఖురాన్‌లో నిర్దిష్టంగా వుంది (సురా 2.282) ఆస్తిహక్కులో కూడా అబ్బాయికి రెండు రెట్లు అమ్మాయికి ఒక భాగం చెందాలన్నారు.

రక్త పాతంతో కూడిన పగ సాధింపు ఇస్లాంలో పేర్కొన్నారు. (సురా 2.178) స్త్రీలకంటె పురుషులు వివేచనలో అధికులని ముస్లిం న్యాయవేత్తలు పేర్కొన్నారు.

ముస్లిం స్త్రీల ముసుగు వారి బానిసత్వానికి గృహ నిర్బంధానికి, తక్కువగా చూడడానికి నిదర్శనంగా నిలచింది. ముస్లిం స్త్రీలు అనేకదేశాలలో బయటకు వచ్చి, తమ స్వేచ్ఛస్వాతంత్ర్యాలను వెళ్లడిస్తున్నా, మొత్తం మీద ఇస్లాం వారిని చిన్న చూపు చూస్తూనే వుంది. రచయిత యీ రంగంలో సోదాహరణలతో వివరణ యిచ్చారు.

ఇస్లాం సాహిత్యంలో వైన్, స్త్రీలగురించి రమణీయమైన కవితలు సాహిత్యం యీ రచయితే ప్రస్తావించారు. వైన్ దైవదత్తమని మహమ్మద్ ఒక చోట ఖురాన్‌లో ప్రస్తావించాడు. (16.69) మరొక చోట వైన్ నిషిద్ధం అని కూడా చెప్పాడు (5.92)

ప్రతి మతం ఆహార పానీయాలలో నిషేధాలు పాటించింది. హిందువులు, క్రైస్తవులు దీనికి మినహాయింపుకాదు. ముస్లింలు పందిని నిషేధించారు. చైనాలో ముస్లింలు పంది మాంసం తింటూనే, దానిని పార్క్ అనకుండా, మటన్‌అని సరిపెట్టుకుంటున్నారు. మొరాకోలో రహస్యంగా తింటున్నారు.

లైంగిక ఆచారాలలో పురుషాయితం, స్త్రీల పట్ల స్త్రీలు అనుసరించే రీతుల్ని కూడా రచయిత ప్రస్తావించారు. ముస్లిం కవుల కవితల్ని చూపారు.

**మహమ్మద్:** రచయిత ఒక అధ్యాయంలో మహమ్మద్ వ్యక్తిత్వాన్ని అంచనా వేశారు. చరిత్రలో ఆయన గొప్ప వ్యక్తి అన్నారు. మక్కా కాలమంతటా మహమ్మద్ చిత్తశుద్ధితో ప్రవర్తించాడన్నారు. మదీనా కాలంలో మహమ్మద్ మారి పోయినట్లు చెప్పారు.

ముస్లింలకు తప్ప ఇతరులకు ముక్తి లేదని, మానవాళికి యీ సందేశం అందించడానికి దైవం నిర్ణయించినట్లు చెప్పారు. ఇది పెద్ద భ్రమ అని రస్సెల్‌ను ఉదహరిస్తూ రచయిత పేర్కొన్నారు.

ఖురాన్ దైవదత్తమనీ, అదే అంతిమ సత్యమనీ మహమ్మద్ చెప్పడంతో కొత్త భావాలకు, స్వేచ్ఛకు స్వస్తి పలికినట్లయిందని రచయిత స్పష్టంచేశారు.

పాశ్చాత్య దేశాలలో ముస్లింలపట్ల, ఇస్లాం, ఖురాన్ గురించి రాజీధోరణిలో ప్రవర్తించడం వలన, ప్రజాస్వామ్యవిలువల పట్ల రాజీపడినట్లయిందని రచయిత హెచ్చరించారు. స్వేచ్ఛకూ, ఇది లేని వారికీ పోరాటం జరుగుతుందనీ, 21వ శతాబ్దంలోకి ముందుకు పోవాలంటే స్వేచ్ఛతో కూడిన ప్రజాస్వామిక మానవ హక్కులు పాటించాలని రచయిత అంటున్నారు.

సాల్మన్ రష్దీ శాటానిక్ వర్సెస్ వంటిది కాదీ పుస్తకం. ఒక ముస్లిం పండితుడు ప్రజాస్వామిక, స్వేచ్ఛా పిపాసిగా ఆక్రందనతో రాసిన పుస్తకం యిది. అయితే ముస్లింలలో వున్న అసమానం దృష్ట్యా యీ రచనకు సుప్రసిద్ధ హ్యూమనిస్ట్ ప్రచురణ సంస్థ అమెరికాలో చేబట్టింది. బహుశ ఇస్లాం గురించి యింత విపులంగా, సమగ్రంగా యిటీవల ఏ రచనా వెలువడలేదేమో.

భారత దేశంలో హమీద్ దల్వాయ్, ఎ.బి.షా వంటి వారు చేసిన రచనలు చాలా మందిని ఆలోచింపజేశాయి. ఈ రచన బహుళ ప్రచారంలోకి వస్తే యింకా కళ్ళు తెరుస్తారు. ఖురాన్ గురించి కూలంకషంగా చర్చించిన అనంతరం, సుమారు 6వేల సురా సూత్రాలతో కూడిన ఖురాన్‌ను రోజూ ముస్లిం పిల్లలకు నూరిపోసి, కంఠస్థం చేయించడం కూడా రచయిత ప్రస్తావించారు.

# ఉర్దూ -గజల్

-ఎస్. సదాశివ

డిసెంబర్ 1996 మిసిమిలో ఉర్దూ కవుల ప్రతీకల గురించి ముచ్చటించుకున్నాము. ఆ ప్రతీకల సంఖ్య ఇరవైలోపే, కాబట్టి కొద్దిపాటి పరిచయం గలవాళ్లయినా ఆ ప్రతీకలను, సంకేతాలను వెంటనే గ్రహించి వాహ్వా అనగలరు. ఉర్దూగజల్ ఆపాతమధురం. అందుకే ముషాయిరాల్లో ఎంతమంది శ్రోతలున్నా ముచ్చట్లాడేవాళ్లు గాని గుసగుసలు పోయే వాళ్లు గాని కనిపించరు. అంతా సావధానంగా వింటారు. కొందరు మిస్రా ఎత్తు కుంటారు. మరికొందరు రెండవ మిస్రాలోని ఖాఫియాను అందుకునే ప్రయత్నంచేస్తారు. మొదటి మిస్రాలోనే భావం చాలవరకు స్పష్టమవుతుంది కనుక రెండవ మిస్రాలోని ఖాఫియాను పట్టుకోవటం కష్టంకాదు.

బుల్బుల్ పూలను ప్రేమించి తోటలో వుండే పిట్ట. అది కమ్మగా పాడుతుంది. తోటలోనే ఏ చెట్టుకో గూడు కట్టుకుంటుంది. పిడుగు పడి ఆ గూడు కాలి పోవచ్చు. పిట్టలు పట్టేవాడు బుల్బుల్‌ను పట్టి పంజరంలో బంధించ వచ్చు. దాని కన్నీ ఆపదలే. కాబట్టి దాని పాట కోయిల పాట లాటి ఉల్లాసకరమైంది కాదు. అసావరి రాగంలాటి కరుణ రసాత్మక మయింది. ''నాలయె-బుల్బుల్'' అంటారందుకే. అంటే బుల్బుల్ విషాదగీతిక.

''మేరే ఆష్యాన్ కాజిక్ర్, క్యా-జొ వొజల్ రహాహై జలాకరే

మగర్ ఇన్ హవావోంకు రోక్‌దో-కె సవాల్ సారె చమన్ కాహై''

అన్నాడు అసర్ లఖ్నవీ అనే కవి. దేశ విభజనకు పూర్వమే జిల్లా కల్లెక్టర్‌గా ఉద్యోగవిరమణ చేసినాడు. దేశ విభజన తర్వాత జరిగిన మతకలహాల సందర్భమున చెప్పిన కవిత యిది. మతకలహాలకు కారణమేదో వుంటుంది. కాని అవి అతివేగంగా వ్యాపించటానికి కారణం పుకార్లే. పునాది లేని పుకార్లు. కవి అంటున్నాడు. ''నా గూడు కాలి పోతున్నదా? పోనీండి, దాని ప్రసక్తి యెందుకు? కాని ఈ గాడ్పులను ఆపండి, ఇది మొత్తం తోటకు సంబంధించిన ప్రశ్న.'' గాడ్పుల వలన గూటి కంటుకున్న అగ్ని, తోట మొత్తాన్ని దహించి వేస్తుంది. కవి బుల్బుల్ నోట మాట్లాడుతున్నాడు. పిడుగును, గాడ్పులను, గూటిని, తోటను గురించి మాట్లాడుతున్నాడు. కాని మనకు మతకలహాలు, పుకార్లు, తగులబెట్టబడిన ఇండ్లు, తగులబడనున్న దేశం స్ఫురిస్తున్నాయి.

హైదరాబాద్ సంస్థాన పాలకుడు మీర్ ఉస్మా నలీఖాన్ ( ఏడవ నిజాము) రెండవ కొడుకు ప్రిన్స్‌మొఅజ్జంజాహ్ మంచికవి. అతని కలం పేరు షజీ. ఎందరో కవులూ గాయకులూ అతని దర్బారును ఆశ్రయించి వుండేవాళ్లు. అతని దర్బారులో కవితా గోష్ఠి, సంగీత చర్చ అర్ధరాత్రిదాక సాగేది. ప్రిన్స్ ఆలస్యంగా నిద్రించేవాడు. మర్నాడు ఆలస్యంగా లేచేవాడు. ఒకనాడు అతడు నిద్రలేచే సరికి పరిస్థితి మారినట్లనిపించింది. నౌకర్లు లేరు. చాకర్లు లేరు. సందడేలేదు. గంటవాయించ గానే ఒక చోబ్‌దార్ వచ్చివంగి సలామ్ చేసి, ''సర్కార్! మనమిప్పుడు గృహనిర్బంధంలో వున్నాము. మన రాజ్యం ఇండియన్ యూనియన్‌లో విలీనమయి పోయింది.''

---

**యస్. సదాశివగారు** అనేక ప్రభుత్వ కళాశాలల్లో ప్రిన్స్‌పాల్‌గా పనిచేశారు. ఇప్పుడు, పదవీ విరమణానంతరం ఆదిలాబాద్‌లో విశ్రాంతి తీసుకొంటున్నారు.

అని విన్నవించుకున్నాడు. ప్రిన్స్ ఆజ్ఞమేరకు కలం కాగితం పట్టుకొని కాతిబ్ (వ్రాయసకాడు) వచ్చి నిల్చున్నాడు. ప్రిన్స్ ఒక గజల్ రాయించి నాడు. అందులోని ఒకషేర్,

సోయేథే గులోంకీ ఛాంక్ మె హమ్, జాగేహైఁ ఖఫస్‌కే గోషేమే;
కబ్ సహనె-చమన్‌మే ధూల్‌వుడీ, కబ్ ఆయిఖిజాఁమాలూమ్‌నహీ.

''రాత్రిపూలవాడిలో పడుకున్నాను. నిద్రలేచే సరికి పంజరంలో ఒకమూలపడివున్నాను. ఆకురాలు కాలమెప్పుడు వచ్చెనో, తోటయెప్పుడు దుమ్ము కొట్టుక పోయిందో తెలియదు.'' అని భావం. పూలు నిండుగా పూసే వసంతం రాత్రికి రాత్రే ఆకురాలు కాలమయిపోయింది. ప్రిన్స్‌కూడ బుల్బుల్ నోట మాట్లాడుతున్నాడు. అతడే మంటున్నాడో స్పష్టమే.

గజల్ కవిత ప్రధానంగా ప్రణయ కవిత. ప్రణయిని రూపుదాల్చిన సౌందర్యం. సాటిలేని సౌందర్యమది. సౌందర్యారాధకుడైన కవి ఆమె వదన మండలాన్ని, ఫాలభాగాన్ని, కనుబొమలను, కనురెప్పలను, కళ్లను, చూపులను, చిన్ననోటిని, ఎర్రని పెదవులను, మెడను, సుదీర్ఘకుటిల కుంతలాలను వర్ణిస్తాడు. చెవులను, ముక్కును సాధారణంగా వర్ణించడు. ఆకాశం వంటి నడుము ప్రసక్తి అప్పుడప్పుడు వస్తుంది. సుకుమారహస్తాలను, సుందర చరణాలను వర్ణిస్తాడు. చరణాల వర్ణన ఆరాధన భావంతోనే. ఏ వర్ణనయినా ఆరాధన తోనే కాని లాలసతో కాదు. వయారపు నడలను వర్ణిస్తాడు. ఆమె సాన్నిహిత్యాన్ని అభిలషిస్తాడు కాని అది సాధ్యమయ్యేది కాదని తెలుసు. ఆమె కఠినశిలా సదృశహృదయ. అప్రాస్య-అలభ్య- ఆమెతో సంయోగం మరణానంతరమే. మరణాన్నే విసాల్( సంయోగం) అనుకుంటాడు. కాబట్టి మరణాన్నే కోరుకుంటాడు. జీవితమంతా ఆమె తలంపులతో, ఆమె అన్వేషణలో, ఆమె దర్శనాభిలాషలోనే గడుపుతాడు. అతని దొక ఉన్మాద స్థితి. తన బాధ నెవరితోనూ చెప్పుకోలేడు. ప్రణయ గోపనం ముఖ్యం. వెల్లడి కాగూడదు. ప్రణయాగ్నిలో హృదయం దహించుక పోతున్నా దాన్ని తనలోనే దాచుకోవాలాయె. కనుకొలుకుల వరకు వచ్చిన కన్నీటిని అక్కడే నిలుపు కోవాలాయె.

ఫానీ మహాకవి అంటాడు;

మెరీ ఆంఖోమ్మె ఆంసూ తుమ్‌సె హమ్‌దమ్! క్యాకహూఁ క్యాహై
ఠహెర్‌జాయేతో అంగారాహై, బహ్ జాయేతో పానీహై

''నాకళ్లలోని అశ్రువుల గురించి మిత్రమా! ఏమి చెప్పను? అక్కడే నిలిచిపోయెనా అగ్ని కణం. జారిపోయెనా జలకణం.'' అని భావం. జలకణానికి విలువ లేదు. మూల్యహీనమైన పదార్థం.

షైదా అనేకవి,

''మెరాదుష్మన్ హువా యే కోన్ షైదా
యెకిస్ నే మేరె జీనే కీ దువాకీ?''

అని ప్రశ్నిస్తున్నాడు. ''మరణశయ్యలో వున్ననేను బ్రతుకాలన్న ప్రార్థన చేస్తున్నారెవరో! నాతో అంతటి శత్రుత్వమెవరికేర్పడినది?''

ప్రాణాంతకమైన ఈ ప్రణయం జోలికి పోవటమెందుకు?

కవి యిలా జవాబు చెప్తున్నాడు;

''దోస్తో! జాఁసే గుజర్తా కోన్‌హై
ఇష్క్ హో జాతాహై, కర్తా కోన్ హై''

''మిత్రులారా! ప్రేమ అదే కలుగుతుంది కాని ప్రేమించే ప్రయత్నం చేస్తారా, ఎవరైనా? చావాలని కోరుతారా, ఎవరైనా?''

మిర్జాగాలిబు కూడా,

'' ఇష్క్‌పర్ జోర్‌నహీ హైయె వో ఆతిష్ గాలిబ్
జో లగాయే న లగే - ఔర్ బు ఝాయే న బనే.''

అంటాడు. ''ప్రేమ యెవరి స్వాధీనంలో వున్నది? అదొక అగ్ని. అంటిద్దా మంటే అంటుకోదు. ఆర్పుదామంటే ఆరదు.''

ఈ ప్రేమనే ఇతివృత్తంగా గ్రహించి పరిమితమైన భాషలో పరిమితమైన అలంకారాలతో పరిమితమైన ప్రతీకల సహాయంతో ఎందరో కవులు ఎన్నో వేల గజళ్లు చెప్పినారు. చెప్తూనే వున్నారు. మొదటి తరం కవులలో వుండే భావ తీవ్రత రాను రాను సన్నగిల్లి కొన్నాళ్లు శబ్దసౌందర్యం పట్లనే శ్రద్ధ చూపినారు కవులు. అలంకార వ్యామోహం అధికమై చిత్రకవిత, బాధ కవితలాంటి ప్రయోగాలు మొదలై గజల్ గౌరవానికి హానికలిగింది. మీర్జాగాలిబ్ గజళ్లు కోల్పోయిన గౌరవాన్నయితే కలిగించినాడు కాని అతని కవిత ముదురు పాకాన బడి వ్యాఖ్యాన సాపేక్షమయింది. అయినా, మీర్‌తఖీమీర్ తర్వాత పేర్కొనదగిన మహాకవి అతడే. అతని తర్వాత మళ్లీ పేలవమై, హాలీ, ఎక్బాలుల వలన మళ్లీ పూర్వోన్నతిని పొంది, మళ్లీ పేలవమై మళ్లీ ప్రజాదరణకు పాత్రమై - ఇలా ఉత్థానపతనాలు పొందుతూ గజల్ ఇంకా ఉర్దూసాహిత్యంలో తన ప్రత్యేకస్థానాన్ని నిల్పుకునే వున్నది. ఈ వుత్థాన పతనాలకు కారణం దేశంలో మారుతున్న చారిత్రక, ఆర్థిక, సామాజిక పరిస్థితులే.

మిత్రులు జ్వాలా ముఖి గా రన్నట్లు ఫారసీ ఉర్దూగజళ్లు సూఫీభావాల కారణంగా ఇంతటి ప్రజాదరణకు పాత్రాలయినవి. లేక పోతే మతసాహిత్యంలో చేరిపోయి వుండేవి. లేదా, కలవారి కాలక్షేపానికి, వినోదానికి పనికి వచ్చే పసలేని పచ్చిశృంగార కవితలయివుండేవి. (లఖ్నోనవాబుల చివరికాలంలో సంగీతసాహిత్యాలు ఆస్థాయికి దిగజారినవి) సూఫీయిజంను ఫారసీలో 'తసవ్వుఫ్' అంటారు. ఇస్లామ్ మతంలోంచి ఆవిర్భవించిన సూఫీయిజాన్ని ఇస్లామిక్ సూఫీయిజమంటారు. గజల్ కవులు ప్రతిపాదించిన సూఫీయిజం ఇస్లామ్ మతానికి భిన్నమయింది కాదు. సూఫీకవులు మతాచార్యుల ధార్ష్ట్యాన్ని, మత మౌఢ్యాన్ని నిరసించినారు కాని మతాన్ని కించపరిచే ప్రయత్నం ఏమాత్రం చేయలేదు, చేయరు. మత సామరస్యాన్ని, మానవతావాదాన్ని ప్రబోధించినారు. గజల్‌కు సూఫీభావాలు లభించటం బంగారానికి పరిమళం లభించినట్లే అయింది.

సూఫీకవులు మతాచార్యులను షేఖులని, వాయెజులని, జాహెదులని, నాసెహాలని సంబోధిస్తారు. వాళ్లు చేసే పాపపుణ్యాల ప్రవచనాలను పరిహసిస్తారు. వాళ్లు నిషేధించిన విగ్రహాలను, మద్యాన్ని మరిమరీ ప్రస్తావిస్తారు.

ఇక్కడొక విషయం గమనించాలి. సూఫీకవులు ప్రస్తావించే వన్నీ అసలైనవి కావు - ప్రతీకలు మాత్రమే. పాపమంటే గజల్ భాషలో మద్యపానం, విగ్రహారాధన. అవీ ప్రతీకలు గనుకనే అంత గట్టిగా చెప్పగల్గుతారు. ఏమతమూ, ఏ సభ్యసమాజమూ పాపాన్ని సహించదు. సమర్థించదు.

ఇస్లామ్ మతంలో అల్లాహ్ ఒక్కడే ఆరాధనీయుడు. ఇంకెవరినైనా అతనికి సమానులుగా భావించటం 'షిర్క్' అనే మహాపాపం. మన్సూర్ అనే వాడు ఆలమెజజ్బ్ (పారవశ్యస్థితి)లో 'అనల్హఖ్ (నేనే దేవుణ్ణి) అన్నాడట. మతాచార్యు లతనికి మరణదండన విధించి ఉరికంబమెక్కించినారు. ఔరంగజేబు సూఫీసర్మద్‌ను ఉరికంబమెక్కించినాడు. సర్మద్ ఫారసీలో రుబాయీలు చెప్పిన కవి. ప్రేమ పారవశ్యం మజ్నూవలె పిచ్చివాణ్ని చేయవచ్చు - మన్సూర్‌ను వలె ఉరికంబ మెక్కించ వచ్చు.

ఫానీ యిలా అంటాడు;

''వొ బాత్ తూ సరె- మంబర్ న కహ్ సకా వాయెజ్
జూ బాత్ అహలె - జునూఁ జేరె - దార్ కహ్తేహై''

'' ఉపదేశకుడా! ప్రేమోన్మత్తులు ఉరికంబం మీద అనగలిగిన మాటను నువ్వు ఉపన్యాసవేదిక మీద కూడా అనలేక పోయినావు. అంటే మన్సూర్ అనగలిగిన మాటను నువ్వనలేక పోయినావు.'' అనిభావం.

మన్సూర్ అన్నమాట సమర్థనీయమా? సమర్థనీయమే అంటాడు జిగర్ మురాదాబాదీ. కానీ ఆస్థితికి చేరుకోవాలె.

'' ఐన్ ఈమాఁహై 'అనల్హఖ్' కతరానా లేకిన్
హై యెహీ కుఫ్ర్ అగర్ దీదయె - మన్సూర్ నహో''

ఈమాన్ అంటే విశ్వాసం. మతం పట్ల విశ్వాసం. కుఫుర్ అంటే అవిశ్వాసం. కాఫిర్ అంటే అవిశ్వాసి. ఖుర్ ఆన్ పట్ల విశ్వాసం లేనివాళ్లు కాఫిర్లు.

''నేనే దేవుణ్ణి అనేమాట నిస్సంశయంగా ఈమానే. మన్సూర్ దృష్టిలేని వా డా మాట అంటే అది కుఫుర్.''

ప్రఖ్యాత సూఫీ కవి ఖ్వాజామీర్‌దర్ద్,

''జగమె ఆకర్ వుధర్ మధర్ దేఖా
తూహి ఆయా నజర్ జిధర్ దేఖా''

అన్నాడు. '' ఈలోకానికివచ్చి అన్నివైపుల చూచినాను - ఎటు చూచినానువ్వే కనిపించినావు.''

ఇసుకరేణువు సూర్యకిరణాలు పడగానే ప్రకాశిస్తుంది. ఇసుక రేణువులో సూర్యుణ్ని, బిందువులో సింధువును చూడ గలిగిన వానికి నువ్వూ నేనూ అనే ద్వైతభావం మిగులదు. అద్వైతంలో అదే నేను. నేనే అది. మన్సూర్ ఈ మాటే అన్నాడు. 'అహంబ్రహ్మాస్మి' అనే మహావాక్యం, 'శివోహం' అనటం 'అనల్హఖ్' అనటమే కదా. మన్సూర్ శిక్షించ బడినాడెందుకు? రహస్యం బట్టబయలు చేసి నందుకు. ప్రణయ గోపనం చేయలేక పోయినందుకు.

తెలిసిన వాడు ఉలుకడు - పలుకడు - ఉన్మాదస్థితిలో వుంటాడు.

''తెరీ ఆహ్! కిస్‌సే ఖబర్ లీజియే
వొహీ బేఖబర్ హై జో ఆగాహ్‌హై.''

అంటాడొక సూఫీకవి. ''నీ గురించి ఎవరి నడిగి తెలుసుకోవాలె? తెలుసుకొన్న వాడు తన సంగతి తాను తెలుసుకునే స్థితిలో వుండడు.''

దేవుడు మానవున్ని ( ఆదమ్‌ను) తనకు దూరం చేసినాడు. ఆనాటి నుంచి మానవుడు మళ్లీ దేవున్ని చేరాలనే ప్రయత్నం చేస్తున్నాడు. వాన్నే వెదుకుతున్నాడు. వాని కోసమే ఎదురు చూస్తున్నాడు. వాన్నే స్మరిస్తున్నాడు. వాడు లేని దెక్కడ? ఇక్కడ మాత్రం లేడా? కాని, ఎక్కడున్నాడో?

''ముఝే బులాకె యహాఁ ఆప్ ఛుప్‌గయా కోయి
వొ మేహమాఁ హుఁ ముఝే మేజ్‌బాఁ నహీమిల్తా''

అంటున్నాడు హాలీ. ''నన్నిక్కడికి పిలిచి తానెక్కడో దాక్కున్నాడు. గృహయజమాని దొరకని అతిథిని నేను.''

గోపికలది ఈ వెతుకులాటే.
బ్రాహ్మణుడు మందిరంలో వున్నాడంటాడు. షేఖు మసీదులో వున్నాడంటాడు.

''షేఖో బిరహమన్ దోనోఁ ఝూటే - దైరొ హరమ్ ఢూండాయాహూఁ
జాన్‌నె వాలో ఛుప్ బైఠేహో ఉస్కా పతా బత్లావోనా''

అన్నాడు ఇటీవల దివంగతుడైన కాళోజీ రామేశ్వరరావు షాద్.

''షేఖు చెప్పేది సత్యం కాదు. బ్రాహ్మణుడు చెప్పేది సత్యంకాదు. మసీదులో వెదికి వచ్చినాను. మందిరంలో వెదికి వచ్చినాను. (వాడెక్కడాలేడు) తెలిసిన వాళ్లేమో మౌనం వహిస్తిరి. వాని అడ్రసు తెల్పరా!''

ఎక్బాల్‌కు వాని అడ్రసు దొరికింది;

''జిస్‌కొమై ఢూండ్తాథా ఆస్మానోమ్మే జమీనోమ్మే
వొనిక్లే మేరె జుల్మత్ ఖాన-యే-దిల్‌కే మకీనోమ్మే''

''ఎవరిని సప్తలోకాల్లో సప్తాకాశాల్లో వెదుకుతున్నానో అతడు నా హృదయకుహరంలోనే వున్నాడు.''

అయినా వెదికే వాళ్లు వెదుకు తూనే వున్నారు. వెదికి ఆశ్చర్యపోతున్నారు.

''జోనఖ్ హైదున్యాకాధోకా నజరాతాహై
పర్దేపె ముసవ్వర్‌హీ తనహో నజరాతాహై
అంటున్నాడు సూఫీకవి అస్గర్ గోండ్వీ

'' ఈలోకపు చిత్రమంతా భ్రాంతిగానే కనిపిస్తున్నది. తెరమీద చిత్రకారు డొక్కడే కనిపిస్తున్నాడు.'' (బ్రహ్మ సత్యం, జగన్మిథ్య)

ఈమాటనే ఆదికవి, కవిబ్రహ్మ మీర్ ఇంకా సరళ శైలిలో చెప్పినాడు.

''యే నుమాయిష్ సరాబ్ కీసీహై-హస్తి అప్నీ హుబాబ్ కీసీహై''

''దృశ్యమానమైన ప్రపంచమంతా ఎండమావిలావున్నది - నా వునికి నీటిబుడగలా వున్నది''.

''కుచ్ జహర్ నథీ షరాబె - అంగూర్ - క్యాచీజ్ హరామ్ హోగయీ హై'' ''ద్రాక్షాసవం విషం కాదుగదా - ఎంత మంచి వస్తువు నిషేధింపబడింది!'' అని బాధపడుతున్నాడొక కవి. మద్య పానం పాపం. పరమ దయామయుడైన భగవంతుని అనుగ్రహానికి పాపులే పాత్రులు గదా. పుణ్యాత్ములెలాగూ స్వర్గానికి వెళ్తారు.

''ఖయాల్ ఛోడ్‌దె జాహెద్ తూ బేగునాహీకా
రఖ్‌హై షోఖ్ అగర్ రహ్మతే ఇలాహీకా''

అంటున్నాడు మీర్;

''పుణ్యాత్ముడా! భగవంతుని అనుగ్రహానికి పాత్రుడవు కావాలని వాంఛిస్తే పాపరాహిత్య మనే భావాన్ని విడిచిపెట్టు.''

మద్యపాత్ర నందించే సాఖీ (భగవంతుడు) హస్తమెంత సుందరమైందో!

''సాగిర్ బదస్తె - హుస్న్ పియే జారహాహుఁమై
కిత్నా హసీఁ గునాహ్‌కియే జారహాహుఁమై ''

అంటున్నాడు జిగర్;

''సుందరహస్త మందిస్తున్న మద్యాన్ని సేవిస్తున్నాను. ఎంతటి అందమైనపాపం చేస్తున్నాను!''

మతాచార్యుడేమో మద్యం మంచిది కాదని బకటే నస - విసుక్కున్న కవి,

''హాయ్ కమ్‌బఖ్త్ తూనె పీహి నహీ'' దౌర్భాగ్యుడా! నువ్వుత్రాగకనే పోతివి. మంచిదో కాదో నీ కేమి తెలుసు?'' అని మందలిస్తున్నాడు.

ఇదంతా మహషర్ (లోకాంతం) కొరకు సిద్ధపడటం - మహషర్‌ను హషర్ అంటారు - ఖియామత్ అంటారు. రోజె - హిసాబ్ అనికూడ అంటారు. అంటే ఆనాడు పరమాత్మ సముఖాన జీవాత్మల పాప పుణ్యాల లెక్కలు జరుగుతవి. పుణ్యాత్ములు స్వర్గానికి-పాపాత్ములునరకానికి. పాపపుణ్యాల పట్టిక రాసే ఫరిష్తాలిద్దరుంటారు. వాళ్లు చదివి వినిపిస్తారు. ఫరిష్తాలకు మనసు లేదాయె. మనసులో పుట్టేకోరికలు లేవాయె. మనసున్న మనుషులు పాపాలెందుకు చేస్తారో ఆజన్మ పుణ్యాత్ములయిన ఫరిష్తాలెలా గ్రహించగలరు? వాళ్లకు సానుభూతి యెలా

వుంటుంది? పాపపుణ్యాల పట్టిక రాసేటప్పుడు మనసున్న ఒక మనిషి కూడా వుండటం న్యాయం. లేక పోతే ఏక పక్ష నిర్ణయమే నాయె.

''పక్డె జాతేహైఁ ఫరిష్తోంకె లిఖే పర్ నాహఖ్
ఆద్మీకోయి హమారా దమె - తహ్రీర్ భి థా?''

అని గడుసుగా అడుగుతున్నాడు గాలిబు

''ఫరిష్తాలు రాసిన దాని మీద అన్యాయంగా పట్టుబడుతున్నాము. రాసేటప్పుడు మాలాటి మనిషి యెవడైనా వుండెనా?''

ఫానీ కి ఒక్కటే ఉబలాటం - వాని సముఖాన నిలుస్తాము. చాలదా? జీవితమంతా కోరిందదే గదా!

''జహన్నుం యాకె జన్నత్ జోభి హోగా ఫైసలా హోగా
యె క్యాకం హై హమారా ఔర్ ఉన్కా సామ్నా హోగా''

''సర్గమోనరకమో తీర్పుయెలా జరిగితే యేమిటి? వాని సమక్షాన నిలుస్తాము. చాలదా?'' అంటున్నాడు ఫానీ.

ఒక కవి భగవంతునికి సలహాయిస్తున్నాడు.

''అయ్ గునాహోంకె జాంచ్నే వాలే!
బఖ్ష్ దేతా తొ బాత్ కుఛ్ భి నధీ.''

''పాపాలను పరిశీలించే వాడా! క్షమించి వదిలి పెడితే సరిపోయేది గదా.'' అపారకరుణానిధివి. క్షమాగుణ సంపన్నునివి. నిన్నడిగే వాడెవడూ లేడా యె. ఈతలనొప్పి తతంగమంతా యెందుకయ్యా!

- - -

కొన్నివేల ఆణిముత్యాల్లాంటి అష్ఆర్లలోంచి సమయానికి స్ఫురించిన పదిపన్నెండు షేర్లు ఉదాహరించి గజల్ తత్త్వాన్ని వివరించి చెప్పటం సాధ్యం కాదు గదా! మహాకవుల గజళ్లను చదువాలని మనవి చేసే ప్రయత్నమే యిది.

ముగించేముందు ఇంకొక మాట కూడా మనవి చేస్తాను. గజల్ ఫారసీలోంచి వచ్చిందనుకున్నాము గదా. ఫారసీలోంచి నేరుగా ఉర్దూలోకి రాలేదు. తొలుత దకనీ లోకి వచ్చింది. దకనీ దక్షిణాన, అంటే బీజాపూర్, గొల్కొండ సామ్రాజ్యల్లో యేర్పడిన భాష. ఉర్దూ ఉత్తరాన రూపొందిన భాష. ఈ రెండు భాషల ఉత్పత్తి వికాసాలు భాషాశాస్త్ర విషయం కాబట్టి నాయీ వ్యాసం పరిధిలోకి రాదు. దకనీ భాషలో మొట్టమొదటి కవి సుల్తాన్ మొహమ్మద్ ఖుల్ ఖుతుబ్షా - గొల్కొండ ఖుతుబ్షాహీ సుల్తానులలో ఐదవవాడు మొహమ్మద్ఖుల్ - హైదరాబాద నగరస్థాపకుడతడే. తన కవితలను సంకలనరూపంలో తయారు చేయించినాడు కనుక అతన్ని మొదటి కవి అంటున్నాము - దకనీ భాషలో కవిబ్రహ్మ అనదగిన వాడు వలీ దకనీ. అతడు

ఖులీఖుతుబ్షా తర్వాత వంద సంవత్సరాల నాటికవి.

ఉర్దూగజల్‌లో పారసీక వాతావరణమే కాని భారతీయత ముద్ర పడలేదన్న విమర్శవున్నది. దకనీ కవిత మీద భారతీయ వాతావరణ ప్రభావమే అధికం.

దకనీ గజళ్ల షేర్లు కొన్ని ఉదాహరించి ఈ వ్యాసాన్ని ముగిస్తాను.

''పియా వాజ్ ప్యాలాపియా జాయెనా
పియా వాజ్ ఎక్ తిల్ జియా జాయెనా
నహీ ఇష్క్ జిస్కో బడాకోర్‌హై
కధీ ఉస్‌సె మిల్ బైసియా జాయెనా.''

ఇవి రెండు ఖులీఖుతుబ్షా షేర్లు - భావం;

''ప్రేయసి చెంత లేనిదే మద్యపానం చేయలేను. ఒక క్షణం జీవించలేను. ప్రేమ యెరుగని వాడు వ్యర్థుడు. వాని చెంత కూర్చోలేను.''

కధీ, బైస్ అనేవి మహారాష్ట్ర ప్రాకృతపదాలు. ఉచ్చారణలోనే తెలుగుతనం. అతని ఆస్థాన కవి వఝీ షేర్లు రెండు;

''ఛిపీ రాత్ ఉజలా హువా దీస్‌కా
లగా జగ్ కరన్ సేవ్ పరమేస్‌కా
సూరజ్ యూం హై రంగ్ ఆస్మానీ మనే
కె ఖిలియా కమల్ ఫూల్ పానీ మనే.''

''రాత్రి దాక్కున్నది. ఉదయకాంతి వ్యాపించింది. లోకులు దైవ ప్రార్థన చేస్తున్నారు.''

'' ఊదారంగు ఆకాశంలో సూర్యుడు నీటిలో కమలంలా వున్నాడు.''

కవిబ్రాహ్మ వలీ దకనీ షేరొకటి;

''జిసే ఇష్క్‌కా తీర్ కారీలగే
ఉసే జిందగీ క్యాం న భారీలగే''

తీవ్రమైన ప్రేమ బాణం తగిలిన వానికి జీవితం భారం కాకేమవుతుంది?''

వలీ దకనీ దక్షిణాన గజల్లు రాస్తూ ప్రచారం పొందుతున్న కాలాన దిల్లీలోని పండిత కవులింకా ఫారసీనే పట్టుక పాకులాడుతున్నారు. మొగల్ ప్రభుత్వం పూర్తిగా బలహీన మయింది. ఫారసీ ప్రభావం తగ్గింది. ప్రజల భాష ప్రభావమే పెరిగింది. అప్పటి ప్రజల భాష హజ్రత్ అమీర్ ఖుస్రూ రూపొందించిన హిందుయీ. దాన్నే హిందుస్తానీ అన్నారు. జబానె - హిందుస్తాన్ అన్నాడు. రేఖ్తా అన్నారు. అదే చాల కాలానికి ఉర్దూ అని పేర్కొనబడింది. గజల్‌లో చెప్పదగిన సుకుమార భావాలను ప్రజల భాషలో చెప్పటం సాధ్యం కాదనుకున్నారు దిల్లీలోని ఫారసీ కవులు. దిల్లీలో వలీ దకనీ గజల్లు విన్నతర్వాత ప్రజల భాషలోనూ గజళ్లు చెప్పవచ్చునసే నమ్మకం కలిగింది వాళ్లకు. ఉత్సాహమూ పెరిగింది. ఎందరో కవులు రేఖ్తా ( ఉర్దూ)లో గజళ్లు రాయటం ప్రారంభించినారు. వలీ దకనీ ఉర్దూ గజల్ రచనకు ప్రేరకుడు. ఉర్దూ కవుల సహవాసంలో వుంటూ వలీ దకనీ తన గజళ్లలోని భారతీయ ముద్రను చెరిపివేసి ఫారసీ సంప్రదాయాన్ని ప్రవేశపెట్టినాడు. అలా జరుగటం సహజమే. వలీని తప్పుపట్టలేము.

# సృజనాత్మక కథనంలో అంతర్ధానం కాగల అంశాలు : అభాసుపాలయిన చలం రాజేశ్వరి మాతృప్రేమ

– అట్లూరు రఘురామరాజు

విశ్లేషణకోసమై చలం **మైదానం** రెండుభాగాలుగా విభజించవచ్చు. రాజేశ్వరి-అమీరుల సంబంధం మొదటి భాగానికి సంబంధించినది అయితే రాజేశ్వరి - మీరాల సంబంధం మొదటి భాగానికి సంబంధించినది. సాధారణంగా యిప్పటి వరకు నవలలోని ఈ మొదటి భాగమే ప్రాముఖ్యంగా చర్చించబడినది. ఇలా ప్రాముఖ్యత గడించిన ఈ భాగంలో రెండు అంశాలను గుర్తించవచ్చు. ఒకటి ప్లాట్ (Plot). రెండవది యిడియమ్ (idiom). ప్లాట్‌కు సంబంధించినంతవరకు రాజేశ్వరి - అమీరుల సంబంధం **తారాశశాంకం** ప్లాటును పోలివుంటుంది. తార-రాజేశ్వరి; అమీరు-చంద్రుడు; రాజేశ్వరి భర్త-తార భర్త, యిలా పోలికలను గుర్తించవచ్చు. యిలా పాత్రల మధ్య పోలికలేకాకుండా తార, రాజేశ్వరి లేచిపోవటానికి గల కారణాలలో కూడా దాదాపు సామీప్యత వుంది. ఇలా చూస్తే రాజేశ్వరి-అమీరులకు సంబంధించిన ప్లాటు పాతదే. అయితే ఈ పాత ప్లాటును తీసుకుని చలం ఉపయోగించిన idiom చాలా కొత్తది, ప్రత్యేకమయినది. **తారాశశాంకం** పద్యాల్లో యిరుక్కుని, నత్తనడకతో ప్రవహించే భావాల్ని, బయటకు మైదానంలోకి లాక్కొచ్చి, స్వేచ్ఛనిచ్చి, వాడుక భాషలో సాధారణమయిన expression ద్వారా వ్యక్తం చేశాడు చలం. కాబట్టి Plot పాతదయినా, idiom లోని ప్రత్యేకత వల్ల, తారాశశాంకం కన్న, చాలా భిన్నంగా వుంటుంది రాజేశ్వరి-అమీరుల సంబంధం. ఈవిధంగా చూసినట్టయితే, రాజేశ్వరి-అమీరుల మధ్య సంబంధం కొత్తపాతల మేలైన కలయిక. అందుకేయిది ఛాందసత్వానికి, అభ్యుదయానికి/విప్లవానికి మధ్య వారధిలాగా అయి సామాజిక మార్పునకు దోహదపడింది. ఛాందసత్వంతో కూరుకున్న చాలామంది, ఆభాషకు అలవాటుపడి, కానిదానితో విభేదించినవారు, ఛాందసత్వం ప్రహరీగోడల దగ్గర తారట్లాడుచున్న మరెందరో, సామాన్యప్రజలు కూడా ఈ నవల చదివి ప్రభావితులయ్యారు. ఇలా ఈ నవల యిలాంటి వారిని కూడా వారికి తెలియకుండానే ప్రభావితంచేసి, వాళ్ళ ముక్కుకు తాడువేసి యిటువైపుకు లాక్కొచ్చింది.

కాని **మైదానం** లోని రెండవభాగం-రాజేశ్వరి-మీరాల మధ్య సంబంధం. ఈ సంబంధం చలం సృజనకు మేలైన ఉదాహరణ. ప్రత్యేకమయిన భావాలున్న ఈ సంబంధాన్ని, మైదానం చివర ఎదురయ్యే ఈ సంబంధాన్ని, అప్పటికే రాజేశ్వరి-అమీరుల గురించి చదివి అలిసిపోయిన, లేకమరీ ఉద్రేకులయిన పాఠకులు శ్రద్ధగా చదవ లేక పొయ్యారేమో? కాని ఈ సంబంధం యొక్క ప్రాముఖ్యత గుర్తించడం ముఖ్యం. ఎందుకంటే, అమీరు పాత్రను తీసేసి, ఏదో ఒక సన్నివేశాన్ని కల్పించి, రాజేశ్వరి-మీరాల మధ్యసంబంధాన్ని దృష్టిలో ఉంచుకొని నవలను చదివితే నవల పెద్దగా మారదు. కాని రాజేశ్వరి-మీరాల విషయంలో యిది సాధ్యం కాదు. మీరాని తీసేస్తే నవల ప్రాముఖ్యత దెబ్బతింటుంది, కేవలం సందేశాత్మకంగా పేలవంగా మారిపోయే అవకాశము, ప్రమాదము వుంది. ఇలా చూస్తే రాజేశ్వరి-మీరాల సంబంధం చాలా ముఖ్యమయింది.

---

**డా. అట్లూరు రఘురామరాజు** గారు కేంద్రీయ విశ్వవిద్యాలయం హైదరాబాద్, ఫిలాసఫీ డిపార్ట్‌మెంట్‌లో రీడరుగా పనిచేస్తున్నారు.

చలం మన కందించిన రాజేశ్వరి-మీరాల మధ్య సంబంధం ఆధునిక తెలుగు సాహిత్యంలో ఒకకొరకరాని కొయ్య, ఒకఎనిగ్మా(enigma). రాజేశ్వరి అమీరుల సంబంధాన్ని ఉచ్చిపచ్చిగానయినా అర్థం చేసుకునే అవకాశముంది. కాని, రాజేశ్వరి-మీరాల సంబంధం పాఠకులను ఉక్కిరిబిక్కిరి చేస్తుంది. అర్థం చేసుకునేందుకు ఎంత ప్రయత్నించినా ఒక కొలిక్కిరాదు. అయితే కొంతమంది సాహసం చేసి ఈ క్లిష్టమయిన సంబంధాన్ని నీతి-అవినీతి అనే పేటికల్లో బంధించి సర్దిపెట్టుకున్నారు. రాజేశ్వరి మీరాతో తిరగడం నీతి అని కొందరు, కాదు అని మరికొందరు ప్రతిపాదించి, సమర్థించుకొని, ఈముఖ్యమయిన సమస్యను సమాధి చేసి కిక్కురు మనకుండా ఉండి పొయ్యారు. యిలా సమాధి కాబడిన ఈ సమస్యను మళ్ళీ బయటకు తీసి, త్రవ్వి (exhume చేసి), శల్య పరీక్ష (Post-mortem) చేసి విశ్లేషించడమే ఈ వ్యాసం ఉద్దేశం.

## II

మైదానం నవల చివర్లో ఎదురయ్యే రాజేశ్వరి-మీరాల మధ్య సంబంధం ముందు నవలలో జరిగిన ముఖ్యాంశాలు. రాజేశ్వరి వైవాహిక జీవితం వొదిలి అమీరుతో మైదానంలోకి లేచిపోవడం. అమీరు కొన్నిరోజుల తర్వాత 'తోళ్ళసాహేబు కూతిరి' పై ప్రేమలో పడడం. దీని గురించి రాజేశ్వరికి తెలిపి తాత్కాలికంగా నిష్క్రమించిన వ్యక్తి మీరా. ఈవిషయం తెలిసిన తర్వాత రాజేశ్వరి మొదట కోప పడినా, తర్వాత బాధను ఆనందంగా మార్చి అతని ఆనందంతో తను ఆనందించాలని నిర్ణయించుకొంటుంది. దీనికోసమై ఆమె స్వయానా తోళ్ళసాహేబు కూతురింటికి ''మర్నాడు సంజ మసకలో అమీర్ని ఆమె యింటికి తీసుకెళ్ళి... ఆ గదిలోనే ఒకమూల తల తిప్పేసి కూచు''ని తలుపులూ, కిటికీలు బిగిస్తుంది. కాని రాజేశ్వరి ఊహించినట్టే అమీరు తోళ్ళసాహేబు కూతురి మధ్య వ్యవహారం అట్టేసాగలేదు. అమీరు ఆమె దగ్గరనుంచి పారిపోతాడు. ఆమె తర్వాత అమీరు వెంటబడినా అసహ్యించుకుంటాడు. అమీరు జీవితం నుంచి తోళ్ళ సాహేబు కూతురు తొలిగిన తర్వాత కొంతకాలం మళ్ళీ రాజేశ్వరి-అమీరులు కలిసి జీవితం గడుపుతారు. రాజేశ్వరి గర్భవతి అవుతుంది. గర్భం గురించి రాజేశ్వరి-అమీరుల మధ్య పెద్ద భేదాభిప్రాయాలు వస్తాయి. అమీరు ఆమెను గర్భం తీసేయించుకోమంటాడు, బలవంతపెడుతాడు, కాని ఆమె ఒప్పుకోదు, మొండికేస్తుంది. ఆమెతో విభేధించి ఆమెను మైదానంలో ఒంటరిగా వొదిలి అమీరు ఎక్కడికో వెళ్ళిపోతాడు.

ఈ ప్రపంచంలో ఉండికూడా తనకు దూరమయిన అమీరు, ఈ ప్రపంచంలో కింకా అడుగిడని, తన కళ్ళకు కనబడని, అయితే తనకు దగ్గరగా, మరీ దగ్గరగా, తన గర్భంలో పెరుగుచున్న శిశువు- ఈరెండు ప్రేమల, వ్యాపకాల, మనఃస్థితుల మధ్య సతమతమవుతుంది రాజేశ్వరి జీవితం. ఈ రెండు ప్రేమలూ తనకు కావాలి. కాని వీలుకాదు ఏదో ఒకటి ఎంచుకో అంటాడు అమీరు. అతని దృష్టిలో ఈరెండు ప్రేమలు పరస్పర విరుద్ధాలు, వేరు వేరు ఆవర్తులు. కాని వీటి రెండింటిని కలపాలని రాజేశ్వరి ఆస్తిత్వం కొట్టుకులాడుతుంది. ఇలాంటి మనఃస్థితిగల రాజేశ్వరి జీవితంలో ప్రవేశిస్తాడు మీరా.

మీరా రాజేశ్వరికి అంతకు ముందే పరిచయం. మీరాతో తన పరిచయాని గురించి ఆమె- ముఖ్యంగా రెండు సందర్భాలలో ప్రస్తావిస్తుంది.

i) తోళ్ళసాహేబు కూతురిపై అమీరు ప్రేమను గురించి తెలుసుకోవడానికై ''చిరునవ్వుతో (మీరా) వంక చూస్తో అతని భుజాల మీద చేతులు వేసి దగ్గరకి వొంగి, కళ్ళల్లో మార్దవత్వాన్ని కల్పించి 'నాతో చెప్పవా' అని సాగసుగా అంటుంది రాజేశ్వరి. (పే.43)

ii) తోళ్ళసాహేబు కూతురి నివాసస్థలం గురించి తెలుసుకోవడానికై మీరా గడ్డం పట్టి వూయించుతుంది. దానితో మీరా కరిగిపోతాడు. (పే.47)

ఇక్కడ గమనించవలసిన విషయం మీరాని రాజేశ్వరి ఈ రెండు సందర్భాలలోనూ reduce(మరులుగొల్పు) చేస్తుంది. కాని యిలా కామవాంఛను వ్యక్తపరచడం ఆమె అభిమతంకాదు. ఇలా చెయ్యడానికి మొదటి కారణం అమీరు రెండవ స్త్రీపై ప్రేమ వివరాలను సేకరించడం. కాని మీరా దీనిని నిజమని అర్థం చేసుకుంటాడు. ఇలా అపార్థంతో మొదలవుతుంది వీరిద్దరి మధ్యసంబంధం. కేవలం యింతటి తోనే ఆగకుండా వీరిద్దరి మధ్య సంబంధం యింకొక మలుపుతిరుగుతుంది. ఇలా అప్పటికే పరిచయమున్న మీరా, అమీరు దూరమయిన తర్వాత గర్భంలో వున్న రాజేశ్వరికి మరీ దగ్గరవుతాడు. ఇలా దగ్గరయిన మీరాతో రాజేశ్వరి చూసింది, లేక ఊహించింది- నాజూకు, నెమ్మదనము, గాంభీర్యము, గౌరవము, మర్యాద, స్వచ్ఛత, నొబిలిటీ. ఆమెకు మీరా, ''అట్లా సుందరమైన పటంలాగా, విగ్రహంవలె, ప్రపంచాత్మానందంకోసం ఉండిపోవలసిన వాడుకాని, సామాన్య మానవులవలె పనికీ వ్యవహారానికే ఉపయోగపడవలసిన వాడుగా కనబడడు.'' (పే.64) మీరాని యిలా వర్గీకరించడం వల్ల ఆమె మీరాపై భ్రాతృత్వం, మాతృత్వం కంటిముందుకొస్తాయి. ఆమె మీరాని reduceచేసి అలా దగ్గరయిన మీరాపై మాతృత్వాన్ని రుద్దుతుంది. కాని మీరా ఆమెలో ప్రియురాల్ని చూసి దగ్గరవుతాడు. ఈ పరస్పర విభిన్న ప్రతిమలు క్రింది సంఘటనలో తేట తెల్ల మవుతాయి.

'' ఒకనాడు మేమిద్దరమూ యేరుదాటి జీడిమామిడిగుబురులో దూరి కూచున్నాము...మీరా తనవేళ్ళతో నా పెదిమల మీద మెల్లగా తాకుతూపాడుతున్నాడు. నేను పరధ్యానంగా వేళ్ళని తీసేశాను. వెంటనే కోపం వచ్చి తల తిప్పేశాడు. అతన్నింకా ఉడికించాలని దూరంగా జరిగాను. నావంక చూశాడు. నేను పలక లేదు. బాగా వుతుక్కుని చప్పున లేచివచ్చి యెదురుగా వుధృతంగా నన్ను కావలించుకున్నాడు. అతని మొహం బాగా యెర్రనయింది...నాభుజం మీద రవికెను పట్టుకున్న వేళ్ళు వణుకుతున్నాయి...తన నోటితో నాపెదిమల్లి వెతుకుతున్నాడు...భయంతో, కోపంతో 'యేమిటిది మీరా?' అన్నాను. మెల్లిగా పట్టువొదిలింది... చప్పున నన్ను వొదిలి పరుగెత్తి వెళ్ళిపోయాడు... ఇంకరాడేమోనని భయమేసింది. కాని సాయంత్రం మెల్లిగా తలవొంచుకొని వచ్చి వొంగి నాకాళ్ళుపట్టుకున్నాడు.

'ఇంకెప్పుడూ చెయ్యను'

'లేవనెత్తి గట్టిగా కౌగలించుకున్నాను 'నాకట్లా బావుండదు ఏం?' అన్నాను.

'మరి నన్ను ఎందుకు ముద్దుపెట్టుకున్నావు.' నా తప్పు తెలిసింది.

'మీ అక్కముద్దుపెట్టుకోదూ? పోనీ మానేస్తాలే'

'వొద్దు, మానెయ్యవొద్దు, నాకు కోపం తెప్పించుకుమరి'. అన్నాడు. (పే.66-67)

ఇలా ఈ సందిగ్ధత బయటపడి మీరాకు తన పై గల అభిప్రాయాన్ని ఆమె త్రోసిపుచ్చి ఈ సంబంధాన్ని అక్కతమ్ముళ్ళ సంబంధంగా తేల్చిచెపుతుంది. దీనిని మీరా కూడా ఈ సందర్భంలో అంగీకరించుతాడు. కాని అంతలోనే, రాజేశ్వరి గర్భస్రావం చేసుకున్న తర్వాత, మీరాని ప్రియుడుగా అంగీకరిస్తుంది. దీనిగురించి రాజేశ్వరి యిలా అంటుంది. '' ఒకేసారి యిద్దరి మీద ప్రేమవున్నట్లు తోచడమూ, ఆ ప్రేమే చెరొకరి మీద చెరొక విధంగా, వేరేకారణాల వల్ల కలిగి నట్టుండడము - ఇదంతా మీ వంటివారు వొప్పుకోరు... మీవి గాలి మాటలు నావి రక్తపు అనుభవాలు''. (పే.77)

అలా అని అప్పటికే రాజేశ్వరి అక్క అనేభావనకు అలవాటు పడుచున్న మీరాని ఒక రాత్రిపిలిచి, చెయ్యిపట్టుకొని, ప్రక్కన కూర్చోపెట్టుకొని, 'మీరానేను నీకు కావాలా?' అని అడుగుతుంది. మీరా అర్థంకాకుండా ఆమె వంక చూస్తాడు. ఆతర్వాత సంభాషణ: '' ఆవాళ మధ్యాహ్నం...' అర్థమయిందని, నాచేతుల్లోని అతని వేళ్ళు నాకు చెప్పాయి. అతని చంపల్లోని సిగ్గుని చూసిమురుస్తో.

''నీకు కావలిస్తే ఈ రాత్రి అయినాసరే''.

'నీ కవసరమా?'

'నాకిష్టమే' నాకు సిగ్గేస్తోంది.

'అదికాదు. నేను నీకు అవసరమా? అమీరు మల్లె కావాలా?'....

'నీతో అబద్ధం చెప్పలేనోయ్ నేను అమీర్ దాన్నే అనిపిస్తుంది. నాకిష్టముండదు. నేనేం గొప్పదాన్నీ, పతివ్రతనీ అని కాదు, '

'అయితే యెందుకడిగావు' ఆప్రశ్న నన్ను గుచ్చుకుంది. సిగ్గుతో,

'నిన్ను సంతోషపెడదామని, యెందుకంటే నేను అమీరు దాన్నైనా అతని మీదకంటే నీ పైనే నాకు ప్రేమ యెక్కువ'. మాటలు తప్పించి యేవో మాట్లాడి వెళ్ళిపోయాడు. (పే. 79)

అలా ఈసారి రాజేశ్వరి మీరాతో ప్రియురాలుగా వుండేందుకు ప్రస్తావిస్తే, మీరా ఒప్పుకోడు. ఎందుకంటే, అతను ఆమె జీవితంలో యింకా అమీరు ఉండడం గమనిస్తాడు. దీనిని మీరా అంగీకరించడు, వీలుకాదంటాడు. వీలవుతుందని వాదిస్తుంది రాజేశ్వరి. '' 'నీకు తెలియదు, అందులో తురకవాళ్ళ సంగతి నీకేం తెలుసు-నేను రానంటాడు'' మీరా. 'నువ్వు రాకపోతే అమీరు రానక్కర్లేదు.' అంటుంది రాజేశ్వరి. అలా అని ఆమె తనకళ్ళల్లోనీళ్ళు పెట్టి ఈ సమస్యను వాయిదా వేస్తుంది.

ఆ తర్వాత అమీరు తిరిగి వస్తాడు. రాజేశ్వరి అమీరులు కొన్ని రోజులు సంతోషంగా గడుపుతారు. ఈ సమయంలో మీరా మాత్రం రాత్రింబవళ్ళు పొదల వెనక దాక్కొని రాజేశ్వరి కోసం యెదురుచూస్తాడు. చివరికి ఆమెని కలుసుకున్నప్పుడు చాలా బాధపడుతున్నట్లు కనబడుతాడు. ఆమెని ''దీదీ'' అని సంబోధిస్తాడు. ఇలా భయపడుచున్న మీరాని, రాజేశ్వరి తను స్వయానా లోపల బాధపడుతూనే, సందేహపడుతూనే, ధైర్యం కలుగ జేస్తుంది. అతనిలో ఉత్సాహాన్ని కలుగజేసి పూర్వ మల్లె ఉండేందుకు ప్రయత్నిస్తుంది. ''రా ఆడుకుందాం, పువ్వులేరుకుందాం'' అని పిలిచి తంగేడు పూవులు ఏరుకొని మీరా చేతికిచ్చి తన తలలో పెట్టమంటుంది. పెడుతాడు మీరా. ఇక్కడ గమనించవలసినది, మీరా రాజేశ్వరిని ''దీదీ'' అని

సంబోధించి ఆమెలో అక్కను చూస్తే, ఆమె మీరాచే తన కొప్పులో పూవులు పెట్టించుకుని అతనిని ప్రియుడుగా స్వీకరిస్తుంది. ఇలా స్వీకరించబడిన మీరా తర్వాత తన తరహా మార్చుకొని ధైర్యంగా తయారవుతాడు. ఇలా తయారయిన మీరా మళ్ళీ రెండు రోజులు కనబడడు ఆ తర్వాత ప్రత్యక్షమయి రాజేశ్వరిని దూరంగా వెళ్ళి మాట్లాడుకుందాం రా అని పిలుస్తాడు. కాని రాజేశ్వరి అంతక్రితం ధైర్యంగా వున్నా, లేకవున్నట్లు నటించినా, ఈసారి ధైర్యంగా వున్న మీరా ముందుకొస్తే అందుకోక, అతనితో వెళ్ళడానికి నిరాకరించి, అతనిని నిరుత్సాహపరుస్తుంది. ఇక్కడ రాజేశ్వరి తనుక్రితం అనుకున్న దాన్ని మార్చి మీరాలో పసిపిల్లాడిని చూస్తుంది. కాని మీరా ఆమెలో ప్రియురాల్ని చూస్తాడు. ఆమె మీరాగురించి యిలా అంటుంది.

'' ఆ యెడారిలో, చీకట్లో కీచుమనే శబ్దాలలో వొంటరిగా, నిస్సహాయంగా, బంధువులందర్నీ విడిచి, నాకై పడి వున్న చిన్నబాబుని చూసి, నా మనసుకరిగి పోయింది, దగ్గరగా కావలించుకున్నాను''. (పే.88)

అలా మీరా చొరవను తిరస్కరించిన అనంతరం వీళ్ళిద్దరూ అక్క తమ్ముళ్ళుగా వుండాలని ప్రయత్నిస్తారు. కాని ఈ ప్రయత్నం ఫలించదు ఎందుకంటే ఒకరోజు మీరావచ్చి:

''అమీరక్కడ వుండగా నీతో చనువుగా వుండలేను. నాచాతకాదు'. అన్నాడు నేనేమనను?
'పోనీ తాక్కపోతేనేం మీరా, చనువుగా వుండకపోతేనేం?'
'అవును తాక్కపోతేనేం? నీకేం?' అని నెమ్మదిగా అన్నాడు.
ఆ 'నీకేం!' అన్న మాటలు అతని కంఠంలో నిరాశ శూలాల వలె నాటుకున్నాయి. (పే.91)

ఈ సంఘటన, దగ్గరకావాలను కుంటున్న వాళ్ళశరీరాలు, ఒకరు మార్చి ఒకరు వాళ్ళ మనసుల ద్వారా వాళ్ళ శరీరాలను ఒకరినుంచి ఒకరు విడదీసే ప్రయత్నానికి, ఈ tension కి ఒక మంచి ఉదాహరణ. ఈగుంజాటనకొంచెం వ్యక్తతలో మరికొంచెం అంతస్సులోపల జరుగుతుంది. వాళ్ళకు తెలియకుండానే, సంభాషణలో కొన్ని వాక్యాలు, పదాలు బయటకు వస్తాయి. వీటిని అర్థంకాని బాధలు అంటుంది రాజేశ్వరి. ఉదాహరణకు, పైన వివరించిన సంఘటనలో మీరా అమీరు ఉండగా నీతో **'చనువుగా'** వుండలేను అని ఆమెతో అంటే, ఆమె ప్రశ్నలో లేనివిషయానికి సంబంధించిన **'తాక్కపోతేనేం'** ని మొదట చెప్పి తర్వాత ప్రశ్న లోని విషయానికి సమాధానంగా చనువుగా వుండక**పోతేనేం** ని జోడిస్తుంది. ఇక్కడ వాక్యనిర్మాణం లోని కాలక్రమాన్నిగుర్తించండి. తాకుట అనేది మీరాప్రశ్నకు సమాధానం కాదు, రాజేశ్వరి శరీరం వ్యక్తం చేసేభావన

కాని ఆమె మీరాలో ఎక్కువగా తమ్ముణ్ణి ముఖ్యంగా బిడ్డని చూస్తుంది. ''నేల మీద నాముందుండి నిద్రపోతున్ననాబాబు, నా నవాబుని చూసినాకు వూరికే దిగులేస్తుంది.'' (పే.93) అంటుంది. అమీరు మీరాని అగాధంలోంచి రక్షించిన తర్వాత కూడా మీరాలో కొడుకుని చూస్తుంది. ''నా పమిట మీరాకి వీవన వీస్తోంది. నా హృదయం అతనికి జోలపాడుతోంది.'' (పే.99). ఇంకా, '' ఏమేమో ఆలోచనలతో దూరాన కట్టేసిన తన లేగను డొక్క లెగరేసుకుంటూ చూసే ఆవువలె మీరా వంక అప్పుడప్పుడు చూస్తో నిద్రపోయినాను'' అంటుంది. (పే.100).

ఇలా రాజేశ్వరి మీరాపై తల్లిప్రేమను వ్యక్తీకరిస్తుంది. కాని దీనిని మీరా స్వీకరించడు,

అర్థంచేసుకోడు. రాజేశ్వరి మీరాకి తల్లిగా దగ్గరకావాలనుకుంటుంది. అతడు క్రితం కారణాలవల్ల వేరే విధంగా స్వీకరిస్తాడు. రాజేశ్వరి కూడా తనకోరికను, స్వభావాన్ని, స్పష్టంగా మీరాకు చెప్పదు. కారణం, తనకేస్పష్టత లేకపోవడం లేక అలా చెపితే మీరా శాశ్వతంగా దూరమవుతాడేమోననే భయంతోనో. ఈ విధంగా రాజేశ్వరి మీరాని తికమక పెడుతుంది. దీనితో మీరా అయోమయస్థితిలో పడుతాడు. కొంచెం అలసిపోయినట్లు, ఓడిపోయినట్టుగా కూడా కనబడుతాడు. ఇక్కడ రాజేశ్వరితో అమీరు ఉన్నాడని మీరాకు తెలుసు. కాని ఆమెలో మీరా ఉన్నాడని అమీరుకు మీరా అగాథంలో పడిన తర్వాతనే స్పష్టమయినది. దీనితో అమీరు నష్టపోతాడు మానసికంగా, ఆమెను కొంచెమయినా కోల్పోతాడు. ఈ అనుకోని సంఘటనలో మీరా పై తన ప్రేమ అమీరుకు తెలిసిందని ఆమె బాధపడుతుంది. ఉదాహరణకు: ' ' 'అమీర్, బతికే వున్నాడు. ఎట్లా! అయ్యోమీరా! నేనింక బతకను, ఎట్లాబతకను, మీరా లేంది!' నాలిక కొరుకున్నాను. ఆమాటన్నందుకు.'' (పే.97) అని అంటుంది.

ఈ సంఘటన ద్వారా లభ్యమయిన స్పష్టతలో మీరాకి ధైర్యం పెరుగుతుంది. దీనితో మీరా రాజేశ్వరిలోని ''దీదీ''ని ప్రక్కన బెట్టి '' ఆరాత్రి, ఆ నీళ్ళలో, యిసికలో, చీకట్లో''. తన దాన్ని చేసుకున్నాడు., ఇలా మొదట రాజేశ్వరి మీరాని తికమక పెట్టినా ఈ సంఘటనలో మీరా తన కోరికలను తీర్చుకొని, రాజేశ్వరి మనఃతత్వాన్ని అర్థంచేసుకోకుండా మిగిలిపోతాడు. ఈ విధంగా ఓడిపోయిన రాజేశ్వరి ఆశించిన మాతృప్రేమను లేక మాతృప్రేమకు కావలసిన అవకాశాన్ని మీరా యివ్వలేకపొయ్యాడు. మీరాకి రాజేశ్వరిలోని మాతృత్వం అర్థంకాదు మగవాడు కదా! అమీరుకూ రాజేశ్వరి తల్లి కావడం యిష్టం లేదు. ఇలా రాజేశ్వరి తహతహలాడిన మాతృప్రేమను ఆమె జీవితంలో చాలాప్రాముఖ్యంగా ప్రవేశించి, ఆమెతో శారీరకసంబంధం కలిగిన ముగ్గురు మగవాళ్ళు భర్త, అమీరు, మీరా- ఆమె పొందేందుకు తోడ్పడలేక పొయ్యారు. కాని ఆమెలో తల్లి ప్రేమ చాలాగాఢమయినది. రాజేశ్వరి ఆమె భర్తను వొదిలి అమీర్‌తో లేచిపోవడానికిగల ఇతరకారణాలలో, తన భర్త ద్వారా తనకు బిడ్డలు కలగకపోవడము అనే కారణం కూడా ఒకటిగా చేర్చవచ్చునేమో?

ఇలా విశ్లేషించితే రాజేశ్వరి మీరా మీద వ్యక్తం చేసింది మాతృప్రేమ. కాని ఈ మాతృప్రేమను వ్యక్తం చేసేందుకు మీరాను దగ్గర తీసుకునేందుకు, దగ్గరగావుంచుకునేందుకు, అతనికి అర్థమయ్యేవిధంగా, ప్రియురాలిగానటించి, దీనిని ఎరగా ఉపయోగాల్సివచ్చింది. ఇక్కడ యిద్దరిలో ఎవ్వరినీ తప్పుపట్టేందుకు లేదు. వారిది నీతి అవినీతి అనే పరిధులకు అతీతమయిన, జీవితానికి దగ్గరయిన, అతి దగ్గరయిన existentialistస్థితి. ఈ విధంగా చూస్తే రాజేశ్వరి తను కనలేని బిడ్డల పైని ప్రేమను మీరాపై రుద్దుతుంది. దీనిని సఫలీకృతం చేసుకోవడానికి తనశరీరంతో, ఆకర్షణతో మీరాని ప్రకోపించి, దగ్గరయిన మీరాపై తల్లిప్రేమను ముందుకు నెట్టి, దానిని మీరాసంపూర్ణంగా స్వీకరించకపోవడంతో, మీరాలోని పురుషకాంక్షకులొంగిపోయి అభాసుపాలైన మాతృప్రేమ రాజేశ్వరిది.

ఇలాంటిక్లిష్టతకల వీరిద్దరి సంబంధంలో అస్తిత్వరూపానీతని అనిశ్చితత్వం, గ్రీకుట్రాజిడే (Greek Tragedy)లోని అంతర్లీనతకు మించిన అగాధాలున్నాయి. ఈవిధంగా ఈ సంబంధం చలం సృజనకు ఒకగొప్ప ఉదాహరణ. ఇలా గుంజాటనకు గురి అయిన ఈ రెండు ప్రేమలు వీటి

పరస్పర వైరుధ్యము చాలా రచనల్లో చాలా చోట్ల కనిపిస్తుంది. బిడ్డలను చాలా ప్రేమించిన చలం, వాళ్ళను గురించి 'బిడ్డల శిక్షణ' అనే గొప్ప రచన చేసిన చలం, స్త్రీ పురుషుల మధ్య లైంగిక ప్రేమకు తన రచనల్లో ఎక్కువ ప్రాముఖ్యతనిచ్చి, పిల్లలను ముందుకు రానియ్యడు. గర్భస్రావం చేయిస్తాడు, చంపేస్తాడు. ఈనేపథ్యంలోంచి చాలారచనల్లోని ''పుట్టని పిల్లలకోర్టులో చలం'' అనే శీర్షికన తయారులోవుంది తర్వతి వ్యాసం.

1. చలం మైదానం లోని వ్యక్తులకు పేర్లు నిర్ణయించడంలో ఒక ప్రత్యేక క్రమాన్ని పాటించారు. రాజేశ్వరికి యిష్టమయిన వారినందరి పేర్లు చెపుతుంది: నరుసుబావ, అమీరు, మీరా. ఆమెకి యిష్టంలేనివారిని వారి సంబంధాల ద్వారా చూసిస్తుంది: భర్త, మామ, తోళ్ళసాహేబు కూతురు. మొ॥. ఈవిషయం చలం యితర రచనలకు వర్తించక పోవచ్చు. మైదానంలోనూ కూడా కొన్ని మినహాయింపులు వుండవచ్చు.

2. ఈసందర్భంలో చలం అమీరు - రాజేశ్వరుల ద్వారా కొన్ని లైంగిక వివరాలను సూచాయిగా చెప్పిస్తాడు. దీనిని గురించిన వివరాలు: రాజేశ్వరి ఊహించినట్టే అమీరు తోళ్ళసాహేబు కూతురి మధ్య వ్యవహారం అట్టే సాగలేదు. అమీరు ఆమె దగ్గరనుంచి పారిపోతాడు. కారణం రాజేశ్వరి చెప్పిస్తుంది అమీరు నోటితోనే.

ఇక్కడ అమీరు - రాజేశ్వరుల మధ్య, అమీరు - తోళ్ళసాహేబుల మధ్య లైంగిక పద్ధతులు కొత్త సందేహాల్ని కలిగిస్తాయి. ఈ సూచనలను ఆధారంగా తీసుకొని వీటి గురించి పరిశీలించవలసింది అవసరమయినా కష్టమే.

''అమీర్, నీకెందుకు ఆమె మీద అంత అసహ్యం కలిగింది?''
''ఏం చేస్తుందంటే! నన్నంతా నలిపేస్తుంది. నాకు వూపిరాడనీదు. నాకాలు...''
''నాకు నవ్వొచ్చింది సిగ్గుపడుతో 'నన్ను నువ్వు? అమీర్?'' అన్నాను.
''కాని ఆడది?'' (పే.52)

**కృతజ్ఞతలు:**

ఈప్రతిని శ్రద్ధగా చదివి, దిద్ది, అమూల్యమయిన సూచనలిచ్చిన నెలనెలవెన్నెల శ్రీ.సి.వి.కృష్ణారావుగారికి, డా॥ అల్లాడి ఉమ, డా॥ శ్రీధర్ లకు నాకృతజ్ఞతలు. ఈ వ్యాసంలోని తప్పుల బాధ్యతనాదే. రాజేశ్వరి - మీరాలసంబంధం గురించి. రచన చెయ్యాల్సిన అవసరాన్ని గుర్తించి ఈవ్యాసం రాయబడడానికి తోడ్పడిన వారు నామాడి శ్రీధర్, సతీష్ చందర్. నేను ఈవిషయంగురించి చర్చించినప్పుడల్లా నాకు ప్రోత్సాహమిచ్చి, విమర్శించినవారు పెద్దిరామారావు, సిద్ధార్థ వీరందరికి నా కృతజ్ఞతలు.

# తెలుగు నేలపై పునరుజ్జీవనోద్యమం - 'కవిరాజు'

– నరేష్ నున్నా

'చరిత్రపై విమర్శనాత్మక దృష్టి సారించడమే పునరుజ్జీవనోద్యమ సారాశం అన్నారు ఎమ్. ఎన్.రాయ్. పాలక వర్గాల పెత్తనాన్ని ప్రశ్నించడం, 'విశ్వాసం' స్థానంలో 'హేతువు'ను ప్రతిష్టించి, మనిషిని స్వేచ్ఛాయుత, హేతుబద్ధ, సృజనాత్మక సభ్యునిగా సమాజంలో నిలబెట్టడమే పునరుజ్జీవన వాద లక్ష్యం. ఇటువంటి ఆదర్శ మానవుడిని రూపొందించడానికై పాత ఆచారాలను, కట్టుబాట్లను, సంప్రదాయక విలువలను బోనెక్కించారు ఆధునిక యూరప్ నిర్మాతలు. ఎంతటి అనాది విశ్వాసమైన ఎంతగా ప్రజల రక్త మాంసాలలో భాగమైపోయిన నమ్మకాన్నైనా వారు పరీక్షకు గురిచేయకుండా విడిచి పెట్టలేదు.

యూరప్ పరిణామాల స్ఫూర్తితో భారత దేశంలో 19వ శతాబ్దాంతంలో పునరుజ్జీవనవాద భావన ప్రవేశించింది. దేశపురోగతికి అడ్డునిలుస్తున్న మూఢ నమ్మకాలను, దేవుళ్లను తుడిచి పెట్టాలని ఉద్యమించారు రాజారామ్మోహన్‌రాయ్, దయానంద సరస్వతి, ఎమ్. ఎన్.రాయ్ వంటి ఆధునికమేథావులు. (శాఖోపశాఖలుగా ఎదిగిన రాయ్ వ్యక్తిత్వ పరిణామంలో renaissance భావం కూడా ప్రధానమైనదే).

తెలుగు నేల (బహుశా దక్షిణ భారతం)పై ఈ భావనకు ఆద్యుడు 'కవి రాజు'త్రిపురనేని రామస్వామి.1887 జనవరి 15న జన్మించి, 56 ఏళ్లు మాత్రమే జీవించిన త్రిపురనేని యావత్ జీవితాన్ని ఒక 'గురిచూసిన ప్రశ్న'గా, 'తలవంచని ధిక్కారం'గా గుర్తించవలసి ఉంటుంది. జనసామాన్యం బ్రతకడాన్ని 'అలవాటుగా' జీవించడం అని అనుకుంటే, అరుదుగా జీవించే వ్యక్తులు మాత్రం 'పొరపాటుగా' జీవిస్తారు. అలా ఆమరణాంతం(మరణానంతరం కూడా) 'జీవించిన' మహనీయుడు త్రిపురనేని. సాధారణంగా రచయితకు సంస్కరణాభిలాష ఉంటుందే గానీ, కార్యకర్తృత్వం వహించలేడు. అదేవిధంగా, సంస్కర్తలు రచయితలు కావడం కూడా కష్టమే. త్రిపురనేని రామస్వామిలో కవి, రచయిత, తాత్వికుడు, సంఘసంస్కర్త సమాన సామర్థ్యంలో కూడి ఉండటం విశేషం. ఆధునిక మానవునికి యూరప్ పునరుజ్జీవనోద్యమం అందించిన ఆయుధాలు 'తర్కం', 'హేతుబద్ధత'. రివల్యూషనరీ రామస్వామి (నార్లసంబోధన) గారి అన్నిదశల్లోనూ ఈ తర్కం, హేతుదృష్టిచాలా తీవ్రంగా కనిపిస్తుంది. సూతపురాణం, 'ధూర్తమానవ' పద్యాలు, కుప్పుస్వామి శతకం వంటి పద్యరచనల్లో, 'ఉత్తరరామచరిత' (శంబుక వధ), "ఖూనీ', 'భాగవద్గీత' వంటి గద్యరచనల్లో ఈ సహేతుక దృష్టి ఎంతగా కనిపిస్తుందో, సాంఘిక విప్లవం పట్ల ఎంత ఆకాంక్ష ద్యోతకమవుతుందో, అంతే బలంగా సాహిత్యపరమైన విప్లవాభిలాష వ్యక్తమవుతుంది. హరినామస్తుతి, ఇష్టదేవతా ప్రార్థన, శ్రీకారంతో కావ్యాన్ని ప్రారంభించడం వంటి సంప్రదాయక పద్ధతులను ఆయన కాలదన్నారు. అందుకే తాను నమ్మిన భావజాల ప్రచారానికి విస్తృతంగా ఉపకరించిన ఆయన రచనలు తాత్కాలికంగా ఆ కాలానికి మాత్రమే పనికివచ్చే కరపత్రస్థాయినిగాక, చిరస్థాయిగా నిలిచే సాహిత్య ప్రమాణాల్ని అందుకున్నాయి.

తమ ఆదర్శాలు నిజం కావాలని కలలుగానే వారు తమ రచనలకు శాశ్వతత్త్వం లభించాలనీ, అవి సర్వకాలీనమవ్వాలని ఆకాంక్షించరు. సమస్యలపై తాము రాసిన రచనలు ఎప్పటికైనా గతంలో భాగమయ్యే రోజు రావాలని మాత్రమే కోరుకుంటారు. ఆ కల నిజమయ్యే సమయం వరకూ

---

**నరేష్‌నున్నా** ఆంధ్రప్రభ హైదరాబాద్ సంపాదకవర్గంలో సభ్యులు

నిరీక్షించే సహనం, నిరీక్షించాలన్న కోరిక వారికి ఉన్నప్పటికీ, కాలం ఎవరికోసమూ ఎదురుచూడదని వారికి తెలుసు. ఏదో క్షణంలో ఆ ప్రవాహం తమను కూడా కలుపుకుపోతుందని కూడా తెలుసు. కనుక, వారు తమ వారసుల మీద కొండంత నమ్మకం పెట్టుకుంటారు. కానీ వారసులు తమను 'ఆరాధ్య దైవాలు'గా మార్చివేసి చేతులు దులుపేసుకుంటున్న చేదునిజం వారికి తెలియకపోవడం వారి అదృష్టం. ముందు తరం అందించిన భావనని మరింత ముందుకు కొనసాగించడం అనే ఆరోగ్యకరమైన ధోరణి ఆధునిక భారతీయాత్మలోనే కొరవడిందని అనిపిస్తుంది. 'కొనసాగింపు' అంటే అదే ఆలోచనా ధోరణిని 'విశ్వాసం'గా భావించి, భక్తి భావంతో కొలవడంగా మాత్రమే మిగిలిపోతుంది.

'గతం' పై వారు విసిరిన ప్రశ్నను కూడా ప్రస్తుతం 'గతం'లో భాగం చేయాలి. దానిపై కొత్తప్రశ్నలను సంధించాలి. కాగా, ఆ ప్రక్రియచాలా అరుదుగా మాత్రమే జరుగుతుంది. భారతదేశంలోని ఎందరో ఆధునికుల విషయంలో ఇదే రుజువైంది. 'గత'మైన ప్రతిరోజుకు పునరుజ్జీవన తర్కాన్ని అన్వయించాలని తదనంతర తరాలకు అనిపించకపోవడం దురదృష్టం. ఎం. ఎన్. రాయ్ భక్తులకు రాయ్ కేవలం రాడికల్ హ్యూమనిస్టుగానే దర్శనమిస్తాడుగానీ నేషనలిస్ట్, ఎక్స్‌ట్రీమిస్ట్, కమ్యూనిస్టు, రాడికల్‌హ్యూమనిస్టువంటి దశలలో ఒకస్వేచ్ఛకై తపించిన tormented souనిగా దర్శనమివ్వడు (కలలో దేవుడు - రాయిస్టుదర్శనం: ఎన్. వి. బ్రహ్మం) (Aesthics & Radical Humanism - N.V.B. - Sept52. Radical Humanism Magazine). అందుకే ఆయన తదనంతరం ఆ భావధారకు ప్రవాహం ఉండదు. ఇటువంటి పరిస్థితులే రామస్వామి తదనంతరం ఎదురయ్యాయి.

కవిరాజు ఉత్తరరామ చరితలోని శంభూక వధోద్యోగములో అంగదుడు శంబుకుడితో ఇలా అంటాడు. 'ద్విజులు మిమ్ము పాషండుడు వనియు, మతద్రోహివనియు తెగుడు చున్నారు. ద్విజేతరులలో విద్యాగంధము లేమచేత బ్రాహ్మణ ద్వేషివని గొణుగుచున్నారు. కట్టకడకు మీరు ఇరువురు తెగలకు కాని వారగుటయే గాక కృతాపరాధులగుచున్నారు'. ఈ వాక్యాలు త్రిపురనేనికి అన్వయించారు ఆయన జీవితాన్ని పరిశీలించిన వారు. అప్పుడు ఆ విధంగా త్రిపురనేని ఏకాకి అయితే ఇప్పుడు వారి ఘనమైన వారసుల అజ్ఞానం వల్ల, ఇరుకుమనస్తత్వం వల్ల కూడా ఏకాకిగానే మిగిలారు. 'త్రిపురనేని రామస్వామి చౌదరి' కవిరాజు పూర్తి పేరు. భావపరిణితి వల్ల కులాన్ని సూచించే 'చౌదరి'ని విడనాడరాయన. ఆయన రచనలను కాలాను గుణంగా పరిశీలిస్తే తొలి దశలో పూర్తిపేరు రాసుకున్న కవిరాజు తర్వాతర్వాత 'చౌదరి'ని తీసివేసినట్లు తెలుస్తుంది. కాని 87లో ఆయనస్మృత్యర్థంగా విడుదలైన తపాలాబిళ్లమీద టి. రామస్వామి చౌదరి అని ముద్రించడం వెనుక కవిరాజు పరిధిని కుంచింపజేసిన ఆయన వారసుల అజ్ఞానమే కారణం.

ఆంధ్రదేశంలో త్రిపురనేని తర్వాత తరంలో ఆయన భావవారసుడిగా పేర్కొనదగిన నార్ల వెంకటేశ్వరరావుగారు 1964లో 'కవిరాజు దర్శనం' వ్యాససంకలనానికి రాసిన పీఠికలో ఈ మార్పు గుర్తించారు. కనుకనే 'రివల్యూషనరీ రామస్వామి'కి నమోవాకాలు పలికారు గాని, 'రామస్వామి చౌదరి'కి మాత్రం కాదు. 'బుద్ధునికి పూర్వం 1,844 సంవత్సరాల క్రితం శ్రీరామచంద్రుడు సింహళంపై దండెత్తినట్లుగా సింహళద్వీపచరిత్ర అయిన 'రాజావళి'లో పేర్కొని ఉండగా, రామాయణ, భారతాలను తర్క దృష్టితో, చారిత్రక అవగాహనతో పరిశీలించి రచనలు చేసిన కవిరాజు ఆ అభిప్రాయంతో ఏకీభవించారు. రామాయణాన్ని మరింత గాఢంగా తరిచి, ఆ ఇతిహాసమంతా ఆహార ఉత్పత్తి (food production) ఆహార సేకరణ (food

gathering)సమాజాల మధ్య ఘర్షణగా నిర్ధారించి, రాముడు వింధ్యపర్వతాలను దాటలేదన్న విమర్శకుల వాదంతో ఏకీభవించారు నార్ల. ఇది కవిరాజు ఆలోచనకు కొనసాగింపు అనడానికి సందేహించనక్కరలేదు.

ఇకపోతే, 'రచయిత భావం ఏమిటి? అతను ఏ పాత్రలో తనను ప్రతిక్షేపించుకున్నాడు' అనే సందేహాలకు తావివ్వకుండా సుదీర్ఘమైన పీఠికలద్వారా తన ఆలోచనలను అవిష్కరించుకునే నాటకకర్త బెర్నార్డ్ షా దారిలో కవిరాజు నడిస్తే అదే దారిలో నార్ల నడిచారు. కనుక నిన్నటి తరానికి చెందినంత వరకు కవిరాజుకు నార్ల నిజమైన వారసులు అనవచ్చు. అయితే వారిరువురిలో కనిపించే లోపాలను గుర్తించి మరో కొత్తదారి వేసే విజ్ఞుల అవసరం ఇప్పుడు ఉంది.

'చిల్లరరాళ్ళకు మొక్కితే చిత్తం చెడుతుంద'న్న పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామీ, 'గుడికి తరచూ పోయిగొణుగుచుండెడివాడు/చెడ్డ పాపమేదో చేసియుండు' అంటూ, చిత్తం చెడినవాళ్ళే తరచు గుళ్ళకు పోతారన్న కవిరాజు, 'పాతవిశ్వాసాలతో, ధర్మాలతో నీతులతో, వేదాంతాలతో కొత్త సంఘాన్ని నిర్మించగలమని పెద్దలైనవారే భ్రమపడుతున్నార'ని గేలిచేసిన నార్ల వంటివారు 'పాతవిశ్వాసాల'ను శుద్ధ తర్కంతో మాత్రమే గమనించడమే పెద్దలోపం. ఉదాహరణకు భారతదేశంలోని సంస్కర్తలు, ఆధునికులు అందరూ విగ్రహారాధనను నిరసించారు. "If God could be reached by worshipping the stone, I should worship the mountain" అని 17వ శతాబ్దంలోని భక్తుడు మలూక్‌దాస్ అపహాస్యం చేశారు. దక్షిణాదిలో 14 శతాబ్దానికి చెందిన తమిళ ఆళ్వారులు బ్రాహ్మణ కులాధిపత్యంపై ఎదురుదాడి చేశారు. అస్పృశ్య కులం నుంచి వచ్చిన తిరుప్పాన్‌తో సహా 12.8 వేరు వేరు కులాలకు చెంది ఆళ్వారులు వేదకాలం నాటి సంస్కృత భాషని కూడా ఎదిరించి పామరునికి కూడా అర్థమయ్యేలా తమిళ శ్లోకాలు రచించి గానం చేశారు. మనిషికి, భగవంతునికి మధ్య పూజారి మధ్య వర్తిత్వం లేకుండా చేయడానికే విగ్రహారాధనని ప్రవేశపెట్టి, తద్వారా సామాన్యుని చెంతకే దైవాన్ని తీసుకువచ్చారు. ఇది చారిత్రక వాస్తవం, ఒకానొక విప్లవ పరిణామం. ఏ ఆచారాన్నైనా అంగీకరించడం, అంగీకరించకపోవడమేగాదు, 'అర్థం చేసుకోవడమనే' మరో ముఖ్యమైన కోణం కూడా ఉంటుంది. దానిని నిజమైన పునరుజ్జీవనవాది కర్తవ్యంగా భావించాలి. ఆ కర్తవ్యాన్ని వారు విస్మరించారు. 'అంతిమంగా సమాధానం తెలిసిపోయిందని, శత్రువు ఎవరో నిశ్చయమైపోయార'ని ఆతరం భావించడమే ఆ విస్మరణకు కారణం.

కవిరాజు జీవితాంతం పరితపించినది 'కులరహిత సమాజం' అనే ఆదర్శం కోసమే. ఆ కలలు ఆయనను వాస్తవవాదం (realism) అనే ఆదర్శం (idealism) వైపునకు నెట్టివేశాయి. 'కల్కి అవతరించి ప్రపంచాన్ని ఉద్ధరిస్తాడని' ప్రగాఢంగా విశ్వసించిన భక్తులు, 'వర్గాలు అంతరించిపోయి సమసమాజ ఆవిర్భావానికి మరెంతో కాలం పట్టదని' ఉటోపియన్ ఊహాలు పోయిన వామపక్షీయులకు, కులరహిత సమాజాన్ని స్వప్నించిన త్రిపురనేనికి తేడా లేకుండా పోయింది. భారత దేశంలో కులాలు లేని సమాజం అని ఆశపడటమంటే 'నేల విడిచిసాము చేయడమే'నని ఆరోజుల్లో ఆయనకు అనిపించక పోవడం ఆశ్చర్యమేమీ కాదు గానీ, ఆయన వారసులు గ్రహించకపోవడమే విచారకరమైన విషయం.

సాంఘికంగా కవిరాజు ముఖ్యపాత్ర వహించిన బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమానికి పరిమితులు

అనేకం. కరుకు మాటల్లో చెప్పుకోవాలంటే కవిరాజు నాయకత్వం వహించిన శూద్ర ఉద్యమం, శూద్రులను నియో బ్రాహ్మణవాదులుగా తయారుచేయడానికి మాత్రమే పనికివచ్చిందనడానికి వర్తమానమే సాక్ష్యం.

గతాన్ని ఒకసారి సింహావలోకనం చేస్తే, బ్రాహ్మణ దేశంగా పేరుపొందిన భారతదేశంలో బ్రాహ్మణాధిపత్యం సాంఘికంగా బాగా తక్కువగా ఉన్న ప్రాంతంలో ఆంధ్ర ప్రాంతం ఒక్కటి. ఆహార ఉత్పత్తి రంగమైన వ్యవసాయం-ద్వారా ఆర్థికంగా ఎదిగిన శూద్రులు ముఖ్యంగా కమ్మ, రెడ్డి కులస్తులు మేథోపరమైన ఆధిపత్యం బ్రాహ్మణుల కిందే ఉండటం సహించలేక, ' ఎదిగేందుకు' చేసిన మహాప్రయత్నాల ఫలితాలే త్రిపురనేని రామస్వామి వంటి నాయకుల ఆవిర్భావం. సహపంక్తి భోజనాలు (చాపకూడు సిద్ధాంతం - బ్రహ్మనాయుడు ఆదర్శం) నిర్వహించడం, సంఘ బహిష్కరణకు వ్యక్తిగతంగా గురికావడం, జీవితంలో ఎదురైన ఒడిదుడుకులను మొక్కవోని ధైర్యంతో ఎదుర్కోవడం వంటి ఎన్నో సంఘటనలు కవిరాజు జీవితాన్ని ఆదర్శనీయంగా చేసినవే. కాని, వీరి పోరాట పటిమ యావత్తు 'మేము మీకు తీసిపోమ' ని బ్రాహ్మణులపై విసిరిన సవాల్పై ప్రధానంగా ఆధారపడిందే కాని, 'మనుషులందరూ సమానమే' అన్న భావంపై ఆధారపడింది కాదు. 'అస్పృశ్యులని, పంచముల' నీ-ఈసడిస్తూ బ్రాహ్మణులు దూరంగావించిన నిమ్న కులస్థులపై కవిరాజు 'దయ' ప్రసరించిందే గాని 'ప్రేమ' కాదు. ఉదారుడైన యజమానికి సేవకుని పట్ల 'దయ' ఉంటుందే గాని, ప్రేమ ఉండదు.

నావాదానికి తార్కాణంగా ఒక్క సంఘటనను ఉటంకించి వ్యాసాన్ని విరమిస్తాను. ఆంధ్రప్రాంతంలో ఆర్థికంగా, సాంస్కృతికంగా అభివృద్ధి చెందిన కృష్ణా, గుంటూరు, ఉభయగోదావరి జిల్లాల్లో బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమం ప్రబలుతున్న రోజులవి. సాంఘిక చైతన్య రీత్యా కమ్మకులస్థులు ఆ ఉద్యమానికి అనధికార నాయకత్వం వహిస్తున్నారు. ఆ దశలో కృష్ణాజిల్లాలోని కొల్లూరులో శంకర పీఠాధిపతి ఆధ్వర్యంలో బ్రాహ్మణులు ఒక సభను నిర్వహించారు. ప్రేక్షకుల స్థానంలో కూర్చున్న కవిరాజు, ఇతర బ్రాహ్మణ వ్యతిరేకోద్యమ నాయకులు (బహుశా గుత్తా చలమయ్య ప్రభృతులు) పీఠాధిపతి కమ్మ కులస్తులపై చేసిన వ్యాఖ్యకు అభ్యంతరం తెలియజేస్తూ వాదనకు దిగారు. వేదిక మీద ఉన్న ఒక బ్రాహ్మణ వక్త 'కమ్మ', 'కుమ్మర' శబ్దసామ్యాన్ని బట్టి వారిరువురు ఏకోదరులని అన్నారు. 'కావచ్చు! అలాగే, 'విప్ర', ' ఉప్పర' శబ్దసామ్యంబట్టి వారిద్దరూ కూడా ఏకగర్భజనితులేనని అని వెంటనే కవిరాజు ప్రత్యుత్తరమిచ్చారు. ఈవాద ప్రతివాదాలు 'బ్రాహ్మణేతర విజయం' అనే గ్రంథంలో చోటుచేసుకున్నాయి. కుమ్మర, ఉప్పర కులాలతో తమ కులాలకు శబ్ద సామ్యం తీసుకురావడం ద్వారా ఇరువర్గాలు పరస్పరం 'అవమానించుకున్నాయి'. అంటే ఆ కులాలపై బ్రాహ్మణులకు ఎటువంటి (చులకన) అభిప్రాయం ఉన్నదో, ఒక సామాజిక ఉద్యమకారునికి కూడా అదే అభిప్రాయమున్నదని స్పష్టమౌతుంది. కనుక, గాంధీ గారి కంటే ముందే 1910లో అంగలూరు బాలికా పాఠశాలలో హరిజన బాలికలను చేర్పించడానికి ఎంతో సామాజిక ప్రతిఘటనను ఎదుర్కోవడంలో కూడా కవిరాజు బ్రాహ్మణ వాద వ్యతిరేక భావమే కనిపిస్తోంది గానీ, దళితుల పట్ల ప్రేమ కాదు. త్రిపురనేని రామస్వామి స్ఫూర్తిగా పోరాటాన్ని జరుపుతున్న నేటి దళితులు ఆయనలోని ఈ పాక్షికతను గమనించి, పునరుజ్జీవన భావ సారాన్ని ఒక వాదంగా కాక, ఆత్మసంబంధిగా అర్థం చేసుకోకుంటే మళ్ళీ తప్పటడుగే పడుతుంది.



**Vijaya Goel's favourite subjects are women and nature**

*Anything related to nature and*
*Women-her two favourite subjects-can be beautiful,*
*colourful, memorable. As she put it herself :*
*"Woman is the most beautiful creation of God".*